

For the first time in India the revolutionery electronic engraving machine in action

# VARIO KLISCHO GRAPH



WHAT IT MEANS TO YOU

Block making time reduced from days to a few hours ■ Electronic control of gradation and detail sharpness ■ Electronic adjustment of colour correction

CHANDAMAMA PRESS - CHANDAMAMA BUILDINGS - MADRAS-26

# నేర్చుకొనుటకు పశితనం ప్రతిబంధకంగాదు



మొక్కలకు అవి బ్రతికే నిమిత్తం నీళ్లు కావలెను అని చిన్న బాలురు పశితనమందే నేర్చుకుందురు. ఈ సామాన్యమైన యథార్థమును ఒక్క మాటు నేర్చుకుంటే ఇంకెన్నటికీ మరువరు.

మీ పిల్లలకు మీరు ఇప్పుడు నేర్పవలసిన మరియొక పాఠము. పళ్లు మరియు పనుచిగుళ్ల పట్ల రోజూ శ్రద్ధవహించుట, అందువల్ల భవిష్యత్తునందు కొన్ని సంవత్సరాలలో దంతక్షయం మరియు పనుచిగుళ్ల జబ్బులబారి బడకుండా వారిని కాపాడినందుకు వారు మీకు అభివందనములర్పింతురు. వారి పళ్లను మరియు పనుచిగుళ్లను ఫోర్‌హన్స్ టూత్ పేస్టుతో తోముకొనుచూ భద్రపరచుకోమని మీ పిల్లలకు నేడే బోధించండి. దంత వైద్యుని చేత తయారు చేయబడిన ఫోర్‌హన్స్' పనుచిగుళ్లకు గుణకారియైన డాక్టర్ ఫోర్‌హన్ యొక్క ప్రత్యేక పదార్థములు గల టూత్ పేస్టు ప్రపంచంలోకెల్ల ఇది ఒక్కటే. రోజూ వాడుచున్నయడల పళ్లు తెల్లగా మెరయుచూ, పనుచిగుళ్లు గట్టిగాను ఆరోగ్యవంతంగాను వుండును. "CARE OF THE TEETH AND GUMS" అనే చిన్న రంగుల పుస్తకం ఉచిత ప్రతి కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 10 న.పై. తపాలా బిళ్లలను పంపండి: మేనర్స్' డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం 10031, బొంబాయి.




## COUPON

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

*Name* ______________________

*Address* ______________________

______________________




## విక్స్ వేపోరబ్ తక్షణమే ఉపశమనాన్ని కలుగజేస్తుంది...
## మీ బిడ్డ సులభంగా శ్వాస పీల్చుకొనుటకు సహాయపడుతుంది...
## రాత్రంతా సుఖంగా నిద్రిస్తాడు

మీ బిడ్డ మంచి-చెడ్డలను చూడవలసిన బాధ్యత మీది. అందు చేత బిడ్డకు జలుబు నొప్పులు వచ్చినప్పుడు, ముక్కునుండి నీరు కారుట, కండ్లనుండి నీరుకారుట, గొంతు బొంగురు పోవుట, శ్రమతో శ్వాస పీల్చుకొనుట మొదలయిన మొదటి జలుబు చిహ్నాలు కనుపించిన వెంటనే విక్స్ వేపోరబ్‌ను పులమండి.

మీ బిడ్డ జలుబుకు విక్స్ వేపోరబ్ అత్యుత్తమమైన నివారిణి ఎందుచేతనంటే ఇది జలుబు బాధిత భాగములన్నింటిలో, ఎచ్చట జలుబు ఎక్కువగా బాధిస్తుందో, అనగా, ముక్కు, గొంతు, ఛాతీలలో చాలా గుణకరంగా పనిచేస్తుంది. మీ బిడ్డ యొక్క మృదువైన చర్మానికి ఇది చాలా మంచిది.




విక్స్ వేపోరబ్‌ను పులిమి, ఉన్ని బట్టతో కప్పి, మీ బిడ్డను సుఖంగా పరుండబెటండి. రాత్రంతా మీ బిడ్డ సుఖంగా నిద్రించే సమయములో విక్స్ వేపోరబ్ దాని ప్రభావాన్ని కొనసాగిస్తూ వుంటుంది. ఉదయానికల్లా అతి చెడ్డ జలుబు కూడా పూర్తిగా పోయి, మీరు అమితంగా ప్రేమించే మీ గారాబు బిడ్డ సంతోషంగా మేలుకొంటాడు.

# విక్స్ వేపోరబ్

3 సైజులలో

VV 464.

# నాకు ఏమయింది చెప్మా?

నేను రోజంతా అలసిపోయి ఉండేదాన్ని. ఆ చిరాకుతో కస్సుబుస్సుమని అపర కాళిలా ఉంటే నా దగ్గరకు ఎవరూ చేరేవారుకాదు.

నా అలసటకు కారణము మా డాక్టరు కనిపెట్టేరు. సరియైన పోషణ లేకపోతే యిలాగే అవుతుందన్నారు. నన్ను హార్లిక్స్ త్రాగమన్నారు

Horlicks

హార్లిక్స్ నాకు శక్తి ఉత్సాహములను కలిగించింది. నేను మళ్లీ మామూలు దాన్ని అయేను. హార్లిక్స్ చేసిన మేలు మరవలేను!

పూర్తిగా పోషణలేక నిరుత్సాహముగా ఉంటే డాక్టర్లు హార్లిక్స్‌ను సిఫార్సు చేస్తారు. పూర్తి మీగడగల పాలతోను గోధుమపిండి, మాల్టెడ్ బార్లీల సారములుగల రుచియైన హార్లిక్స్ త్వరలోనే శక్తి నిస్తుంది.

## హార్లిక్స్

అదనపు శక్తిని కలిగించును!

Horlicks

THE IDEAL FOOD DRINK FOR ALL AGES



గోకుల్ ఆర్ట్ థియేటర్స్ వారి

# విశాల హృదయాలు

డైరెక్షన్
**B.S.నారాయణ**

మ్యూజిక్
**T.V.రాజు**

ప్రొడ్యూసర్
**D.కృష్ణమూర్తి**

ఆంధ్ర: కృష్ణాపిక్చర్స్..
సీడెడ్,నైజాం:ఈస్టిండియా



## పాటలు పాడే బొమ్మలతో

## చిన్న పిల్లలకు పుస్తకం

రంగు రంగుల అందమైన చిన్న పిల్లలకు విద్యాబోధన చేయడమనే అంశం క్రొత్తదేమీ కాదు. ఈ బొమ్మలకు తోడు రకరకాల ధ్వనులు, ఆ ధ్వనులకు చేసే బొమ్మలు వుంటే చిన్న పిల్లలు ఇంకా త్వరగా అక్షరాలు, మాటలు నేర్చుకొన గలుగుతారు.

సంగీతయుక్తంగా పాటలు పాడుతూ, రకరకాల ధ్వనులు చేసే బొమ్మలను, ఆ బొమ్మలకు సరిపడే అక్షరాలను కలిగిన అందమైన చిన్న పిల్లల పుస్తకం ఒకటి మా కార్యాలయం చేరింది. 'అ' మొదలు 'అః' వరకూ అక్షరాలు ఇందులో వున్నాయి. ప్రతి పేజీని చేతితో నొక్కితే రకరకాల ధ్వనులు వినిపిస్తాయి. పాఠశాలకు రేపో, మాపో వెళ్ళనున్న పిల్లలకు ఇది ఎంతో ఉపకరిస్తుంది. ఈ పుస్తకంతో ఆడుకొంటూ, బొమ్మలవైపు పదే పదే చూడడంవల్ల చిన్న పిల్లల మెదడులో అక్కడి అక్షరాలు బాగా నాటుకపోయి బాగా గుర్తుంటాయి.

ఈ పుస్తకం ఆధునికంగా వుంది. ఇన్ని చక్కని ఆకర్షణలు కలిగిన పిల్లల పుస్తకం రావడం తెలుగులో ఇదే ప్రథమం.

వెల రు. 1-50

హెగ్గిన్‌బాదమ్సు ప్రైవేటు లి.
165, మౌంటు రోడ్డు, మద్రాసు-2.


ఈస్ట్‌మన్ కలర్‌లో
నిర్మించిన
తొలితెలుగు
అపరాధపరిశోధక
చిత్రం
శ్రీనివాస్ మూవీస్
సింగపూర్
సిఐడి
NVKR
దర్శకుడు దాదామిరాసి * నిర్మాతలు సూరవరపు భాస్కరరావు. యర్రాకన్నయ్య * రచన ఆరుద్ర * శ్రీఫిలింస్

# ఎవరెస్ట్ టైనీటాట్‌తో పిల్లలు ఉల్లాసంగా వెళ్ళుతున్నారు

ఒక షోకైన చిన్న వాక్యూం ఫ్లాస్కు—స్కూలుకు వెళ్లే పిల్లలు వారి కిష్టమైన వేడి లేక చల్లటి ఆహారాన్ని, పానీయాలను తీసుకు వెళ్లటానికిగాను ప్రత్యేకంగా డిజైను చెయ్యబడ్డది. ఈ టైనీటాట్ ఎవరెస్ట్ వాక్యూం ఫ్లాస్కులకు గల అన్ని విశిష్టాంశాలను, నాణ్యమైన సామగ్రిని కలిగియుంది. మీ బిడ్డకు స్వంతానికి ఒక టైనీటాట్‌ను తెచ్చిపెట్టరా ? గర్వకారణమైన ఇట్టి వస్తువులు శక్తివంతమైన వ్యక్తిత్వాన్ని పొందగలట్లు అతని దృక్పథాన్నే మార్చ తోడ్పడగలవు. "బిడ్డ మనిషికి తండ్రి" అని కదా నానుడి!




**విక్టరీ ఫ్లాస్క్ కంపెని ప్రైవేట్ లిమిటెడ్,**

బొంబాయి ★ కలకత్తా ★ ఢిల్లీ ★ మద్రాసు

Vapi-6/63



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

పిరికివాళ్ళు దౌర్జన్యానికి సులువుగా లొంగిపోతారు. ఐక్యప్రతిఘటన లేకుండా శత్రువును జయించటం కష్టం. పాలకులు దుర్బలులైతే ప్రజలకు తీరని కష్టాలు సంప్రాప్తిస్తాయి. సరిఅయిన నాయకత్వం లేనిదే ప్రజలలో ఉండే శౌర్య పరాక్రమాలు రాణించవు. నిజమైన ధీరుడు స్వవిషయాల కన్న దేశ క్షేమాన్ని ఎక్కువగా పరిగణిస్తాడు. ఈ విషయాలన్నీ బేతాళ కథ ["ఘోరమైన పరిహారం"] స్పష్టం చేస్తుంది.

పరోపకారి పాపన్న కథ ["నగలపెట్టె"]లో గాంధీ మతావలంబి అయిన వాడికి సామాజికులు పూనుకుని ఎలా న్యాయం చేకూర్చేదీ చక్కగా చిత్రించబడింది.

"గంగమ్మ గర్వ భంగం," "గడ్డిచొక్కా" అన్న కథలు కుయుక్తులు బెడిసికొడతాయని రుజువు చేస్తాయి.

సంపుటి : 37 - సెప్టెంబరు 1965 - సంచిక : 3

CHITRA



# భారత చరిత్ర




దక్కనులో వైస్రాయిగా వచ్చే నాటికి ఔరంగజేబు 18 ఏళ్ళ యువకుడు. అతను సామ్రాజ్య శత్రువులను అణచటానికి దీక్షగా కృషి చేశాడు; సూరత్ సముద్ర తీరానికీ, ఖాన్‌దేశ్‌కూ మధ్యగా ఉన్న బాగ్లానాను పట్టుకుని, కొన్ని దుర్గాలను షాహజీ నుంచి లాగేసుకున్నాడు.

దక్కను వైస్రాయి పదవి నిర్వహించటంలో ఔరంగజేబుకు అనేక ప్రతిబంధకాలేర్పడ్డాయి. డబ్బు లేకపోవటం ఒకటి. అంతకన్న ముఖ్యమైన దేమంటే అతని అన్న అయిన దారాషుకోహ్ నాయకత్వాన ఔరంగజేబుకు విరుద్ధంగా ఒక కూటమి ఏర్పడింది. షాజహాంకు దారాషుకోహ్ అంటే చాలా ఇష్టం. ఈ పరిస్థితులలో ఔరంగజేబు 1644 లో తన వైస్రాయి పదవికి రాజీనామా ఇచ్చి, 1645 ఫిబ్రవరిలో గుజరాతుకు గవర్నరుగా నియోగించబడ్డాడు.

ఔరంగజేబు తన పెద్ద అన్న శత్రుత్వం మూలాన ఢిల్లీలో ఉండలేక పోయాడు. 1653 ఆరంభంలో అతను రెండోసారి దక్కనుకు వైస్రాయిగా వచ్చాడు. ఆ సమయంలో అక్కడి పరిపాలన అయోమయ స్థితిలో ఉన్నది. ఆర్థిక పరిస్థితి అధ్వాన్నంగా ఉన్నది. తన వెంట దివానుగా వచ్చిన ముర్షిద్ కులీఖాన్ సహాయంతో ఔరంగజేబు శిస్తు విధానాలను ఏర్పాటు చేసి రైతులకూ, ప్రభుత్వానికీ కూడా లాభదాయకంగా ఉండే చరిత్రాత్మకమైన ఏర్పాట్లు కొనసాగించాడు. వాటితో దక్కను సౌభాగ్యం పెంపొందింది. 1658 నాటికి ఔరంగాబాదు ప్రాంతంలో ఒక్క సెంటు బంజరుభూమి కూడా లేదట.

1636 నుంచీ గోల్కొండ ఢిల్లీకి లోబడి ఉండి కూడా కప్పం సరిగా చెల్లించటం లేదు. గోల్కొండ సుల్తాను కింద మంత్రిగా

ఉన్న మీర్‌జుమ్లాను సుల్తాను సరిగా చూడక పోయే సరికి, అతను మొగలులను శరణు జొచ్చాడు. గోల్కొండ పై ఔరంగజేబు దెబ్బ తీయటానికి ఈ రెండు సాకులూ దొరికాయి.

మీర్‌జుమ్లా అసలు పేరు ముహమ్మద్ సయీద్. అతను పర్షియా దేశపు వర్తకుడు. అతను వజ్రాలూ, ఇతర రత్నాలూ విక్రయించి అంతులేని ధనం సంపాదించి, గోల్కొండ సుల్తానయిన అబ్దుల్లాకుతుబ్‌షా వద్ద కొలువు కుదిరాడు. అతను అసాధారణమైన తెలివితేటలూ, యుద్ధతంత్రజ్ఞతా, పరిపాలనా సామర్థ్యమూ ప్రదర్శించి ప్రధానమంత్రి అయాడు. ఈ పదవిలో ఉంటూ అతను నిరంకుశంగా ప్రవర్తించ సాగాడు. అంతేగాక, సొంతాన అతను యుద్ధాలు చేసి, కర్ణాటక ప్రాంతాలలో విస్తృత ప్రాంతాలు స్వాధీనపరచుకున్నాడు. 300 మైళ్ళ నిడివీ, 50 మైళ్ళ వెడల్పూ గల ఈ ప్రాంతం నుంచి అతనికి ఏటా 40 లక్షలు రాబడి ఉండేది. దానితో అతను సొంతంగా ఒక సేనను, ఫిరంగులతో సహా, ఏర్పాటు చేసుకున్నాడు. అతనికి రాజనే పేరు లేకపోయినా, రాజు కుండే హంగు లన్నీ ఉండేవి. నానాటికీ పెరిగి పోతున్న మీర్‌జుమ్లా బలాన్ని చూసి భయపడి సుల్తాను, అతని కొడుకు ముహమ్మద్ అమీన్‌ఖాన్‌నూ, అతని కుటుంబాన్నీ అరెస్టు చేసి, మీర్‌జుమ్లాను లొంగదీసు కోవాలని చూశాడు. మీర్‌జుమ్లా ఢిల్లీ చక్రవర్తి తోనూ, ఔరంగజేబు తోనూ కుట్ర చేశాడు.



ఔరంగజేబు కుమారుడైన ముహమ్మద్ సుల్తాన్ తండ్రి ఆజ్ఞ పైన 1656 జనవరిలో హైదరాబాదు పైన దాడిచేశాడు. ఫిబ్రవరి 7 న ఔరంగజేబు స్వయంగా గోల్కొండ పై దాడి జరిపించాడు.

మొగలు సైనికులు దేశాన్ని కొల్లగొట్టారు. ఔరంగజేబు ఉద్దేశం గోల్కొండ రాజ్యాన్ని కబళించెయ్యాలనే.

అయితే ఇది కొనసాగకుండా దారాషు కోహ్, జహాఁఆరాలు అడ్డపడి తమ తండ్రి అయిన షాజహాఁ చేత ఔరంగజేబుకు ఉత్తరువు పంపి గోల్కొండ ముట్టడి ఎత్తింప జేశారు. 1656 మార్చి 30న ముట్టడి అంత మయింది. గోల్కొండ సుల్తాను చక్రవర్తికి పరిహార కానుకగా 10 లక్షలు నగదూ, రంగీర్ జిల్లా అర్పించుకున్నాడు. సుల్తాను కుమార్తెను ఔరంగజేబు కొడుకు ముహ మ్మదు సుల్తాను కిచ్చి పరోక్షంగా వివాహం జరిపారు. సుల్తాను అనంతరం ఆయన అల్లుడు సుల్తా నయేటట్టుగా లోపాయికారీ ఒప్పందం కూడా జరిగింది. మీర్‌జుమ్లా గోల్కొండ రాజ్యానికి ప్రధానమంత్రిగా త్వరలోనే నియమించబడ్డాడు.

పోతే బిజాపూరు అంతు తేల్చవలిసి ఉన్నది. 1656 నవంబరు 4 న ఆదిల్‌షా చనిపోయాడు, 18 ఏళ్ళ వయసు గల ఆయన కొడుకు రాజ్యానికి వచ్చాడు. ఈ కుర్రవాడు చనిపోయిన సుల్తాను కొడుకు కాడనీ, ఎవరి కొడుకుకో తెలియదనీ, అందు చేత బిజాపూరు పై దండెత్తి వెళ్ళటానికి అనుతించవలిసిందనీ ఔరంగజేబు తండ్రికి రాసి అనుమతి పొందాడు. బిజాపూరు పాల కుల వారసత్వ సమస్యలతో ఢిల్లీకి ఎలాటి సంబంధమూ లేదు. ఇది పూర్తిగా అధర్మ యుద్ధం. ఇందులో ఔరంగజేబుకు మీర్ జుమ్లా సహాయపడ్డాడు. 1657 జనవరిలో దాడి ఆరంభమయింది. మార్చి ఆఖరులో బీదరు దుర్గమూ, ఆగస్టు 1 న కల్యాణీ దుర్గమూ లొంగిపోయాయి.

1657 సెప్టెంబరులో షాజహాఁ మంచాన పడ్డాడు. వెంటనే అతని కొడుకుల మధ్య పదవి కోసం భయంకరమైన పోరాటం ప్రారంభమయింది. షాజహాఁ వ్యాధితోనే గాక, అవమానం తోనూ, కొడుకుల తగవుల వల్ల కలిగిన మానసిక పీడతోనూ తీసుకుని చనిపోయాడు.



# నేహ్రూ కథ

## 15



**1921** లో దేశం అట్టుడికిపోయింది. ఉద్యమం క్రమంగా వేడెక్కిన కొద్దీ అధికార్లు సన్నగా దమన విధానం ప్రవేశపెట్టారు. ప్రముఖ కాంగ్రెసువాదుల పై ఆంక్షలు జారీ అయాయి; వారు కొన్ని కొన్ని ప్రాంతాలలో అడుగు పెట్టరాదు. "సరిహద్దు గాంధీ" అన్న బిరుదు సంపాదించుకున్న ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్‌ను అరెస్టు చేసి, మూడేళ్ళపాటు జైలు శిక్ష విధించారు. లోగడ ప్రభుత్వ బిరుదులూ, బహూకృతులూ పొందినవారు వాటిని విసర్జించారు. విద్యార్థులు "ఇంగ్లీషు" స్కూళ్ళ నుంచీ, కాలేజీల నుంచీ బయటికి వచ్చేశారు. వీరిలో కొంత మంది "జాతీయ" విద్యాలయాలలో చేరారు. చాలా కొద్ది మంది మాత్రమే జాతీయోద్యమంలో ప్రవేశించారు.

విశ్వకవి టాగూరు సహాయనిరాకరణోద్యమాన్నీ, విద్యా విసర్జననూ ఖండించాడు. అయినా ఉద్యమం తీవ్రంగా వ్యాప్తి చెందింది. **1921** జులైలో అ. భా. కాం. కమిటీ విదేశీ వస్త్ర బహిష్కరణనూ, ఖాదీ ఉత్పత్తినీ బలపరుస్తూ తీర్మానించింది. సారాదుకాణాల వద్ద పికెటింగు సాగింది. జులై ఆఖరు రోజున గాంధీజీ బొంబాయిలో తన అధ్యక్షత కింద విదేశీ వస్త్రదహనం జరిపించాడు.

బ్రిటిషు అధికారులు ఒక్కొక్క కాంగ్రెసు నాయకుణ్ణీ అరెస్టు చేయనారంభించారు. సెప్టెంబరు ఆరంభంలో అలీ సోదరులు అరెస్టయి, రెండేళ్ళ కఠిన శిక్ష విధించ బడ్డారు. విద్రోహక ప్రసంగాలు చేస్తున్నందుకు జవాహర్ను అరెస్టు చేస్తామని అధికారులు బెదిరించారు గాని, ఆ అరెస్టు అంత త్వరగా జరగలేదు.

ఇలాటి తీవ్ర పరిస్థితిలో బ్రిటిషు ప్రభుత్వం, వేల్స్ యువరాజు (ఇప్పుడు



విండ్సర్ ప్రభువు) భారతదేశంలో పర్యటించటానికి ఏర్పాట్లు చేసింది. అందువల్ల భారతీయులలో రాజభక్తి పెంపొంది సహాయనిరాకరణోద్యమం సమసిపోతుందని వారి భ్రమ!

వేల్సు యువరాజు రాక సందర్భంలో జరిగే ఉత్సవాలను బహిష్కరించ వలిసిందిగా ప్రకటిస్తూ, ఇందులో బ్రిటిషు సింహాసనాన్ని అవమానించే ఉద్దేశం లేదనీ, రాజకీయోద్దేశంతో యువరాజు పర్యటన ఏర్పాటు చేయబడిందనీ వివరించింది కాంగ్రెసు.

నవంబరు 17 న వేల్సు యువరాజు బొంబాయిలో దిగాడు. వెంటనే అల్లరులూ తగలబెట్టటాలూ ఆరంభ మయాయి. ఇవి మూడు రోజులు సాగాయి. పోలీసులు కాల్పులు చేసి, యాభై మందిని చంపారు, దాదాపు 400 మందిని గాయపరిచారు. "స్వరాజ్యం కంపు కొడుతున్నది," అని గాంధీజీ నిరశనవ్రతం ప్రారంభించి, శాంతి నెలకొనే దాకా నిరాహారంగా ఉంటానని ప్రకటించాడు.

ఆ తరవాత శాంతి త్వరలోనే నెలకొన్నది, నవంబరు 22 న గాంధీజీ నిరశన చాలించాడు.

అయితే యువరాజు ఎక్కడికి వెళితే అక్కడ జీవితం స్తంభించి పోయింది. దుకాణాలు మూసేశారు, స్కూళ్ళు నడవలేదు, వీధులు నిర్జనమైపోయాయి.

ఈ పరిణామం చూసి ప్రభుత్వం కంగారెత్తి ఉమ్మడి అరెస్టులకు పూనుకున్నది. నవంబరు 19 న కాంగ్రెసు కార్యాలయాలూ, ఖిలాఫత్ కార్యాలయాలూ చట్ట విరుద్ధమైనవిగా ప్రకటన జరిగింది. డిసెంబరు ఆరంభంలో, కాంగ్రెసు అధ్యక్షుడైన దేశబంధు చిత్తరంజనదాసూ, మరికొందరూ అరెస్టయారు. "భారతదేశమే ఒక పెద్ద జైలు. కాంగ్రెసు కార్యక్రమం కొనసాగాలి. నేను అరెస్టయితే నేం, కాకపోతే నేం? బతికి



వుంటే నేం, చనిపోతే నేం?" అని దేశ ప్రజలకు దాను సందేశ మిచ్చాడు.

పంజాబూ, బీహారూ, యు. పి. మొద లైన రాష్ట్రాలలో కూడా ఇలాగే అరెస్టులు సాగాయి. మీటింగు కోసం సమావేశమైన జిల్లా కాంగ్రెసు నాయకులు 50 మంది మూక ఉమ్మడిగా యు. పి. లో అరెస్టు చేయబడ్డారు. గవర్నమెంటు ఆఫీసుల నుంచి సాయంకాలం ఇళ్ళకు తిరిగి వచ్చే ఉద్యోగులు ఉద్యమంలో చేరి, ఇళ్ళకు వెళ్ల టానికి బదులు జైళ్ళకు వెళ్ళిన సందర్భా లున్నాయని జవాహరు అన్నాడు.

జైళ్ళను నింపటమే ప్రభుత్వం కోరిక అయితే, దేశంలో అందుకు సిద్ధంగా ఉండిన వారు వేలాదిమంది!

డిసెంబరు 6 న జవాహర్ రోజల్లా చురుకుగా పని చేసి, సాయంకాలానికి ఆనందభవనం చేరుకునే సరికి అక్కడ పోలీసులు సోదా చేస్తున్నారు. జవాహరునూ, మోతీలాలునూ అరెస్టు చెయ్యటానికి వాళ్ళ వద్ద వారంట్లున్నాయి. ఇద్దరి పైనా వేరు వేరు అభియోగా లున్నాయి, ఇద్దరినీ వేరు వేరు న్యాయస్థానాలలో విచారణ చేశారు, కాని ఇద్దరికీ ఒకే శిక్ష విధించబడింది— ఆరు నెలల ఖైదు. మోతీలాలు నేరం చట్ట



విరుద్ధమైన కాంగ్రెసు వాలంటీరు సంస్థలో సభ్యుడు కావటం. జవాహర్ నేరం హర్తాలు కరపత్రాలు పంచటం. నిజాని కిది అనాడు చట్ట విరుద్ధం కాదు. ఈ సంగతి అధికారు లకు దరిమిలా తెలియవచ్చింది; మూడు నెలలు జైలు శిక్ష అనుభవించాక జవాహర్‌ను విడుదల చేశారు.

విచారణలు అస్తవ్యస్తంగా జరిగాయి. మోతీలాలు నేరం రుజువు కావాలంటే ఆయన సంతకం గల కాంగ్రెసు సభ్యత్వ పత్రం కావాలి. ఒక సభ్యత్వ పత్రాన్ని కోర్టులో దఖలు పరిచారు. పరమక్షుద్రుడూ, నిరక్షరుడూ అయిన సాక్షి ఒకడు ఆ పత్రాన్ని

తల్లకిందులుగా పట్టుకుని, దాని మీది సంతకం మోతీలాలుదే నని సాక్ష్యం ఇచ్చాడు! కోర్టులను బహిష్కరించటం కాంగ్రెసు నియమం కావటం చేత మోతీలాలు గాని, జవాహరు గాని ప్రతి వాదన చేసుకోలేదు.

మోతీలాలు విచారణ జరుగుతూన్నంత సేపూ నాలుగేళ్ళ మనమరాలు ఇందిర తాత ఒడిలోనే కూర్చుని కోర్టు గురించి తొలి అనుభవం సంపాదించింది.

తనకు పడిన శిక్ష వింటూనే మోతీలాలు తన సహచరులకు ఇలా సందేశం పంపాడు: "నేనూ, నా ఏక పుత్రుడూ మాతృదేశ సేవకు గాను జైలుకు పోతున్నాం. వాలంటీర్లను వందల సంఖ్యలలోనూ, వేల సంఖ్యలోనూ చేర్పించండి. స్వరాజ్యం వచ్చిన దాకా అహింసాయుత సహాయ నిరాకరణోద్యమాన్ని అవిచ్ఛిన్నంగా సాగనివ్వండి. ఇండియాలో స్వాతంత్ర్య దేవతకు ఒకే అలయం ఉన్నది—జైలు. అక్కడికి తీర్థ ప్రజగా యాత్రికులు చేరుదురు గాక."

1921 డిసెంబరు, 1922 జనవరి మాసాలలో 30,000 మంది యాత్రికులు జైళ్ళకు వెళ్ళారు! ఈ మూక అరెస్టులు ముఖ్యంగా బెంగాలులోనూ, యు. పి. లోనూ జరిగాయి. ఈ రాష్ట్రాల లోని కాంగ్రెసు నాయకులూ, కార్యకర్తలూ మూక ఉమ్మడిగా అరెస్టయారు. చిత్రమేమంటే, అంత దాకా కాంగ్రెసుతో ఏ విధమైన సంబంధమూ లేనివారు సైతం ఉద్యోమోద్రేకానికి గురి అయి జైళ్లను వరించారు. యువకులూ, కుర్రవాళ్ళూ పోలీసు లారీలలో ఎక్కి కూర్చుని దిగ నిరాకరించారు. పేర్లు లేకుండా ఇంతమంది కొరకని వారంటులు జారీ కావటమూ, వారంటులో ఉన్న సంఖ్యను మించినవాళ్ళు లారీలలో జైళ్ళకు చేరటమూ, ఏం చెయ్యాలో జైలు అధికార్లకు తెలియక పోవటమూ కుడా జరిగింది.





# నవాబు నందిని

## 2

మానసింహుడి దృష్టిలో జగతసింహుడు చేయరాని పనులు, ఒకటీ, రెండూ కాదు, అనేకం చేశాడు.

అనేకమంది యోధుల సమక్షాన జగత సింహుడు తండ్రి ఎదట నిలబడి, అయిదు వేల సైన్యాన్ని ఇచ్చినట్టయితే, పఠానులను సువర్ణరేఖానది అవతలికి తరిమేస్తానని ప్రమాణం చేశాడు. అంత కార్యభారం నెత్తి మీద వేసుకున్నవాడు ఆ పని విడిచి పెట్టి, అర్ధ రాత్రివేళ తన ప్రియురాలిని వెతుక్కుంటూ మరొకరి కోటలోకి దొంగ లాగా ప్రవేశించి, పఠానులకు చిక్కి, బందీ అయాడు. ఈ విధంగా అవిధేయుడూ, అయోగ్యుడూ అని నిరూపించుకున్న కొడుకు పైన మానసింహుడికి ఎక్కడలేని ఆగ్రహం పుట్టుకొచ్చింది.

ఆ కోపం మూలానే ఆయన పఠానులను నిర్మూలించి, తన కొడుకును విడిపించుకునే ప్రయత్నం కూడా చెయ్యలేదు.

విమల చేత చచ్చే ముందుగా కతలూ ఖాన్ జగతసింహుణ్ణి విముక్తుణ్ణి చేసి, మానసింహుడి వద్దకు సంధి రాయబారం పంపాడు. కొడుకు తెచ్చిన సంధి రాయబారానికి మానసింహుడు సుముఖుడయాడు. ఎందుచేతనంటే, ఆయన శీఘ్రంగా ఢిల్లీకి వెళ్ళవలిసిన పని ఉన్నది; వర్షాకాలం గడిస్తేనే గాని సయ్యద్‌ఖాన్ తన సేనలను తీసుకుని వచ్చి చేరడు. పెద్ద

దామోదర ముఖర్జీ



ఎత్తున యుద్ధం కన్న సంధే మేలు. సంధికి మానసింహుడు ఒప్పుకోగానే, కొత్త నవాబు సులేమాన్‌ఖాన్, తన మంత్రి తోనూ, సేనానాయకుడైన ఉస్మాన్‌ఖాన్ తోనూ వచ్చి మానసింహుడికి పెద్ద ఎత్తున కానుకలు సమర్పించాడు. మానసింహుడు వాటితో తృప్తిచెంది, వచ్చిన వారిని తగినరీతి సత్కరించి పంపేశాడు. అయన తన మొగలాయీ సైన్యాలను పాట్నాకు వెళ్ళిపోవలిసిందని ఉత్తరు విచ్చినప్పుడు, ఆ సైన్యానికి చెందిన ఒక సేనాపతి అయిన తన కొడుక్కు ఎలాటి బాధ్యతా ఇవ్వలేదు. అతన్ని గురించి విచారణ జరపాలన్న భావం అప్పటికే మానసింహుడికి ఉండింది.

ఆ పైన జగతసింహుడు మరికొన్ని అపరాధాలు చేసి తండ్రి కోపాగ్నికి ఆజ్యం పోశాడు. అతను తండ్రితో చెప్పకుండా సైనిక శిబిరాన్ని వదిలిపెట్టి మందారణ దుర్గానికి వెళ్ళిపోయి, తండ్రి అనుమతి కూడా పొందకుండా తిలోత్తమను పెళ్ళాడాడు. పెళ్ళికి అతని బంధువులు చాలా మంది వచ్చారు. నవాబుకూతురు అయిషా సపరివారంగా వచ్చింది. పెళ్ళి మహావైభవంగా జరిగింది. పెళ్ళికి తన తండ్రిని పిలవటం గాని, అయన ఆశీస్సు పొందటం గాని జగతసింహుడు చెయ్యలేదు.

మానసింహుడి దృష్టిలో జగతసింహుడు రెండు తప్పులు చేశాడు. అతను తండ్రికి తెలపకుండా పెళ్ళాడటం ఒక తప్పు; వీరేంద్రసింహుడి కుమార్తెను పెళ్ళాడటం మరొక తప్పు. అయన దృష్టిలో వీరేంద్రసింహుడూ, అతని కూతురూ కులహీనులు.

జగతసింహుడి నేర పరంపర తిలోత్తమను పెళ్ళాడటంతో ఆగలేదు. మొగలాయి సేనలు పాట్నాకు తరలి వెళ్ళేటప్పుడు, అతను అక్కడికి వెళ్ళి సైనికాధికారిగా తన బాధ్యత లేవీ నిర్వర్తించ లేదు. అసలతను

అక్కడికి వెళ్ళనైనా లేదు. అంతే కాదు, అతను భార్యతో ఆనందంలో ఓలలాడుతూ, దారుకేశ్వర తీరాన దిక్కు లేకుండా పడి ఉన్న తన సేనను గురించి నెల రోజులు ఉపేక్ష వహించాడు.

కొడుకు చేతలన్నీ, తలుచుకుంటే మాన సింహుడి ఆగ్రహం మిన్ను ముట్టింది. అత నికి రాజదండన జరిగి తీరాలని ఆయన నిశ్చయించాడు. అందుచేతనే ఆయన అందరూ వింటుండగా తన భటులకు, "జగతసింహుణ్ణి గాని, అతని శవాన్ని గాని పట్టుకురండి," అని కఠోరమైన ఆజ్ఞ యిచ్చాడు. వారు వచ్చి శైలేశ్వర మందిరం వద్ద అతన్ని పట్టుకున్నారు. ఏ శైలేశ్వర మందిరం దగ్గిర జగతసింహుడి 'ప్రణయ కథ ఆరంభ మయిందో అక్కడే అంతం కూడా అయినట్టు కనబడింది.

పాట్నాలో మానసింహ మహారాజు తన కొడుకును బహిరంగంగా విచారించటానికి దర్బారు జరిపాడు. విచారణ వినటానికి వేలాదిగా జనం వచ్చి కూర్చున్నారు. మాన సింహుడు ఎత్తయిన ఆసనం పైన కూర్చు న్నాడు. ఆయన కిరు పక్కలా ముఖ్య రాజోద్యోగులు ఇతర ఆసనాల పైన కూర్చు న్నారు. సభ జనంతో కిటకిటలాతున్నా నిశ్శ



బ్దంగా ఉంది. అందరి మనస్సులూ భయాం దోళనలతో నిండి ఉన్నాయి.

"బందీని తీసుకురండి," అని మాన సింహు డాజ్ఞాపించాడు.

మధ్యవయసు గల భటుల మధ్య తల వంచుకుని నడుస్తూ జగతసింహుడు వచ్చి తన తండ్రి ఎదట నిలబడ్డాడు. మానసింహు డతన్ని "బందీ" అని సంబోధిస్తూ, అతను తన కుటుంబ విషయం లోనూ, రాజకీయం గానూ అనేక అపరాధాలు చేశాడనీ, ముందు అతను తన వంశానికి చేసిన అపరాధాలు విచారించి ఆ తరవాత రాజకీయ ద్రోహాలు విచారిస్తాననీ అన్నాడు.

వృద్ధుడైన మొగలాయీ సభికు డొకడు లేచి, "మహారాజా, ఈ కుఱ్ఱవాడి అపచారాలు క్షమించమని వేడుకుంటున్నాను. కుటుంబ విషయాలను గురించి బహిరంగంగా కాకుండా, రహస్య విచారణ చేయటం మంచిదేమో!" అన్నాడు.

"లేదు, లేదు. బందీ చేసిన కుటుంబ ద్రోహలకూ, రాజకీయ ద్రోహలకూ సంబంధం ఉన్నది. ఎవరూ వెళ్ళిపో నవసరం లేదు," అన్నాడు మానసింహుడు.

మానసింహుడు విచారణ ప్రారంభిస్తూ, ముద్దాయిని, "నేను వెయ్యబోయే ప్రశ్నలకు నిజమైన సమాధానాలు చెప్పకపోతే నీ అపరాథం మరింత ఎక్కువగా పరిగణించ బడుతుంది," అన్నాడు.

దానికి జగతసింహుడు గర్వంతో, "మహారాజా, ఆ మాట చెప్పటం అనావశ్యకం. జగతసింహుడు తన ప్రాణం కాపాడుకోవటానికి కూడా అబద్ధం చెప్పడు," అని జవాబిచ్చాడు.

"నీవు వీరేంద్రసింహుడి అంతఃపురంలోని ఒక గదిలో ఒక స్త్రీతో బాటు పఠానులకు చిక్కి బందీ వైన మాట నిజమేనా?"

"నిజమే."

"నీవు పఠానుల వశమందున్న కాలంలో కతలూఖాన్ కూతురైన ఆయుషా హృద



యంలో నీపై ప్రేమ రగుల్కొల్పిన మాట నిజమేనా ?"

"ఆ ప్రశ్నకు దీర్ఘంగా సమాధానం చెప్పాలి. నవాబునందిని అయిన అయిషా నాకు మేలు చేసిన మనిషి. నేను చావు బతుకుల మధ్య ఉన్నప్పు డామె నాకు తల్లి లాగా, చెల్లెలు లాగా, భార్య లాగా స్నేహితురాలి లాగా సమస్తమైన ఉపచారాలూ చెయ్యని పక్షంలో ఇవాళ నా విచారణ ఇక్కడ జరగటం సాధ్యం కాకపోను! ఆమెను దేవత లాగానూ, కపటం లేని అప్పురాలి లాగానూ భావిస్తాను. ఆమె పట్ల నాకు మరొక విధమైన భావం లేదు. కాని దురదృష్ట వశాన నవాబునందిని నన్ను ప్రేమిస్తున్నట్టు ఒక సందర్భంలో నాకు తెలిసింది. అది తెలిశాక, ఆమె ప్రేమను ఏ విధంగానూ స్వీకరించ లేనందుకు నేను చాలా బాధపడ్డాను."

"ఆమె కారణంగా నీకూ, పఠాన్‌సేనాని అయిన ఉస్మాన్ ఖాన్‌కూ ద్వంద్వయుద్ధం జరిగిందా ?"

"ఉస్మాన్ ఖాన్ అయుషాను ప్రేమించాడు. ఆమె ప్రేమకు పాత్రులైనవా రిద్దరుండరాదనీ, అందుచేత నేను తనతో యుద్ధం చెయ్యాలనీ అన్నాడు. నేను యుద్ధం చెయ్యలేదు."





"అప్పుడప్పుడూ నవాబు కూతురికి ఉత్తరాలు పంపావా?"

"ఒక్క సారే పంపాను."

"నీ అంతట నీవే ఆమెను చూడటానికి వెళ్ళావా?"

"వెళ్ళాను. వెళ్ళిపోయేటప్పు డామె నొక సారి చూసి పోదామని వెళ్ళాను."

"ఆమె నిన్ను చూడకుండానే పంపించేసింది, కదూ?"

"అందు కొక కారణం ఉన్నది."

"ఇంత అయాక కూడా నీవు నవాబు నందినిని ప్రేమించ లేదనీ, ఆమె మాత్రమే నిన్ను ప్రేమించిం దనీ అంటావా?"



"ఉన్న సంగతి చెప్పాను. నమ్మటమూ, మానటమూ మహారాజుగారి ఇష్టం."

"వీరేంద్రసింహుడి కూతురు నీ ఉంపుడుగత్తేనే?"

జగతసింహుడు ఈ మాటకు చలించిపోయాడు. అతని శరీరంలో విద్యుత్తు ప్రవహించి నట్టయింది.

"మహారాజా, మీరు శాసనకర్తగా, రాజుగా, ప్రత్యేకించి నాకు తండ్రిగా గౌరవించ తగ్గవారు. ఈ మాటే మరొకడు అని ఉన్నట్టయితే వాణ్ణి చీలికలూ, వాలికలూగా చేసి ఉండేవాణ్ణి. వీరేంద్రసింహుడి కుమార్తె నా భార్య—అగ్ని సాక్షిగా పెళ్ళాడిన ధర్మపత్ని!" అన్నా డతను.

మానసింహుడు కోపోద్రేకంతో భయంకరంగా అయిపోయి, "రాజపుత్ర వంశానికి కళంకం తెచ్చిన అధముడా! ఒళ్ళు తెలియక ఇలా అన్నందుకు నీ నాలుక వెయ్యి చీలికలు చేసినా పాపం లేదు. సిగ్గు చేత పోక నీ ప్రాణా లింకా నిలబడి ఉన్నాయా? వీరేంద్రుడి కూతురు నీకు ధర్మపత్నా? ఆ వీరేంద్రసింహుడు ఒక దాసీముండ కోసం నీళ్ళు మోసేవాడి లాగా నా అంతఃపురంలో ప్రవేశించాడు; పట్టుబడి, ఒక జారిణికి పుట్టిన విమల అనే దాన్ని పెళ్ళి చేసు



కున్నాడు—ఆ నీచుడా నీకు మామ? ఆ నీచ జాతి విమల నీకు సవతి అత్తగారా? నీ ధర్మపత్ని ఎటువంటి దానికి పుట్టింది? అది ఎవరి మనమరాలు? నీ భార్య మాతామహుడు శశిశేఖరు డనే వాడు చేయరాని పనులన్నీ చేసి, ఇప్పుడు సన్యాసి అయి, పరమ జ్ఞాని లాగా తిరుగుతున్నాడు—అభిరామస్వామి! ఈ నీచు లందరూ ఇప్పుడు నీకు బంధువర్గమా? నీ వివేక మేమయింది? ఆ వీరేంద్రసింహుడి కుమార్తె నీ ఉంపుడుగత్తె అని చెప్పకున్నా నీలో దోష మంతగా కనిపించేది కాదేమో! నన్ను శత్రువు కింద జమకట్టి, నా అనుమతి గాని, ఆశీస్సు గాని లేకుండా ఈ పెళ్ళి చేసుకున్న నీవు నా కొడుకువు కావు. మానసింహుడి కొడుకు నని నీ వెక్కడన్నా చెప్పకున్నావో నీకు మరణ దండన తప్పదు," అన్నాడు.

సభికు లందరూ దిగ్భ్రమ చెంది కొయ్య బొమ్మల్లాగా మానసింహుడు చెప్పేది వింటున్నారు. కొంచెంసేపు ఆగి ఆయన జగతసింహుడి రాజకీయ నేరాలను విచారించ నారంభించాడు.

"నీ రాజకీ యాపరాధాలను గురించి కొన్ని ప్రశ్న లడుగుతాను. నీవు పాదుషా సేవకుడవై వుండీ, ప్రత్యేకించి ఒక కార్య



భారాన్ని మీద వేసుకున్న సేనాపతివై ఉండీ కూడా, ఇతరుల దుర్గం లోకి, దుర్గాధిపతి అనుమతి లేకుండా, రాత్రి వేళ దొంగ లాగా ప్రవేశించావా లేదా?"

జగతసింహుడు తల వంచుకుని సమాధానం చెప్పలేదు.

"నీ అయిదువేల సేననూ, పఠానులను తరిమివేసే పనినీ విడిచి పుచ్చి, ఒక స్త్రీ కోసం నీ వక్కడికి వెళ్ళావా లేదా?"

జగతసింహుడు మాట్లాడలేదు.

"పఠానులు నిన్ను విడిచిపెట్టాక నీవు సైనిక శిబిరానికి వెళ్ళి, నా ఉత్తరువుల కోసం అక్కడ ఎందుకు వేచి ఉండలేదు?"



జవాబు లేదు.

"సేనాధిపతు లందరూ శిబిరం ఎత్తేసి, తమతమ సేనలను తీసుకుని బయలుదేరు తుంటే, వారి వెంట నీ వెందుకుండలేదు?"

జవాబు లేదు.

"ఎవరి ఉత్తరువూ లేకుండా, పాదుషా వారి పని ఒక్కటీ చెయ్యకుండా నీ ఇష్టం వచ్చి నట్టు కాలం ఎందుకు గడిపావు? మాట్లాడవేం? దుర్మార్గుడా, నీ వంటి వాడికి మరణ శిక్ష తప్ప వేరే దండన ఏ ముంటుంది?"

వృద్ధుడైన మొగలాయీ మళ్ళీ లేచి, "హుజూర్, క్షమించండి. ఒక విజ్ఞాపన. యువరాజు మీ కొడుకు—" అని ప్రారంభించాడు.

"ఈ నీచుడు నా కొడుకన్నవా రెవరు? వీడికీ నాకూ కొడుకూ తండ్రీ సంబంధం లేదని ముందే చెప్పాను," అన్నాడు మాన సింహుడు తీవ్రంగా.

"సరే మీరు ధర్మం ఎరగరా? యువ రాజింకా పసివాడు!" అంటూ మొగలాయీ వృద్ధుడు కూర్చున్నాడు.

మానసింహుడు కాస్సేపు తలవంచుకుని ఆలోచించి, "నిందితుడా, నీకు సరి అయిన శిక్ష మరణ దండనే! అయినా నీ వయసును పాటించి నీకు యావజ్జీవ కారాగార శిక్ష విధిస్తున్నాను," అన్నాడు. ఆయన భటులతో, "ఇతడి నగలూ, దుస్తులూ తీసేసి, బందీ దుస్తులు తొడిగి నా ఎదటనే అతడి కాళ్ళకూ, చేతులకూ సంకెళ్ళు తగిలించి, అందరూ చూస్తుండగానే కారా గృహానికి తీసుకు పొండి," అన్నాడు.

భటులు జగతసింహుడి దుస్తులు మార్చి, సంకెళ్ళు తగిలించి తీసుకుపోతుంటే సభలో కలవరం పుట్టింది. సేనాపతులు తలలు వంచుకున్నారు, వృద్ధులు కంట తడి పెట్టారు. జగతసింహుడు కను మాటు కాగానే సభ లేచింది. —(ఇంకా వుంది)





## ఘోరమైన పరిహారం

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నిన్ను చూస్తే యక్షదత్తుడి పరిహారం చెల్లించటానికి ఘోరమైన పాట్లుపడిన సాలంకులు జ్ఞాపకం వస్తున్నారు. వారి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

బ్రహ్మదేశపు పశ్చిమ తీరాన గల తారా ద్వీపంలో ఒక దుర్బలుడైన రాజు రాజ్యం చేస్తూ ఉండేవాడు. ప్రతి ఏడూ దక్షిణ దీవుల నుంచి దస్యరాజు సైనికులు వచ్చి తారాద్వీప వాసులను భయపెట్టి, ఆ దేశంలో ఉండే ప్రతి ఒక్క రోలుకూ, రోకలికీ, చేటకూ, తిరగలికీ, పొయ్యికీ వేరు వేరుగా పన్నులు వేసి, ఆ సొమ్ము పట్టుకుపోతూండే వారు. పన్నులు చెల్లించకపోతే

బేతాళ కథలు



దస్యులు వచ్చి తారాద్వీపాన్ని కొల్లగొట్టి నానా భీభత్సమూ చేస్తారన్న భయంతో రాజు ఏటా పన్నులు చెల్లించేవాడు. ఈ పన్నుల భారంతో ప్రజలు ఆ యేటి కా యేడు దారిద్ర్యంలో కూరుకుపోసాగారు.

దస్యులు మహాక్రూరులు, అనాగరికులు. వారితో యుద్ధం చెయ్యటమంటే సామాన్య ప్రజలకు భయం. అందరి కన్న పిరికివాడు రాజు. ప్రజలలో అసాధారణ శౌర్య పరాక్రమాలు గల వారు లేకపోలేదు. కాని వారిని కూడగట్టే నాయకుడు లేడు. అందుచేత వారి పరాక్రమం నివురుగప్పిన నిప్పు లాగా ఉండిపోయి, ఏమాత్రమూ రాణించ లేదు.



ఇలా ఉండగా ఒక యువకుడు తారా ద్వీపానికి కొత్తగా వచ్చాడు. కావటాని కతను తారాద్వీప వాసే, కాని చిన్నతనం లోనే అతన్ని యక్షులు తమ ప్రాంతాలకు తీసుకుపోయి యుక్తవయస్కుడయే దాకా పెంచి, స్వదేశానికి తిప్పి పంపారు. అతను కొన్ని యక్ష విద్యలతో పాటు "జలతార" అనే నౌకనూ, "అప్రతిహతం" అనే ఖడ్గాన్నీ తీసుకు వచ్చాడు. "జలతార" నీటి పైనా, నేల పైనా కూడా దాని నాయకుడి ఇచ్ఛానుసారం, దానంతట అదే నడుస్తుంది. "అప్రతిహతం" దెబ్బకు గండరాళ్ళు సైతం వెన్న లాగా తెగిపోతాయి.

ఆ యువకుడి పేరు యక్షదత్తుడు. అతని తండ్రీ, అన్నలూ తారాద్వీపంలో ఉంటున్నారు. వారు విచారంగా ఉండటం చూసి యక్షదత్తుడు కారణం అడిగితే, పన్నులు వసూలు చెయ్యటానికి దస్యులు రాబోతున్నట్టు తెలిసింది. దస్యులను గురించి వినే సరికి యక్షదత్తుడికి భరించరాని ఆగ్రహం వచ్చింది. అతను వెంటనే రాజు వద్దకు వెళ్ళి, "దస్యుల దౌర్జన్యం మితిమీరిపోతున్నది. తారాద్వీప వాసులు తీసుకుంటూ చావటం కంటె దస్యులను చంపి చావటం మేలు. మీరు యుద్ధానికి సన్నాహం



చెయ్యండి, లేదా నన్నయినా చెయ్యి నివ్వండి," అన్నాడు.

అతి కష్టం మీద రాజు యక్షదత్తుణ్ణి యుద్ధ యత్నాలు చేయనిచ్చాడు. తారా ద్వీపంలో ఉండే యోధుల నందరినీ పిలవ టానికి యక్షదత్తుడు తన తండ్రినీ, అన్న లనూ తలా ఒక దిక్కుకూ పంపాడు. అలా వెళ్ళిన యక్షదత్తుడి తండ్రిని సాలంకు లనే ముగ్గురు సోదరులు పట్టుకుని చంపేశారు. అందుకు కారణం ఉభయ కుటుంబాల మధ్యా ఉండే పాత పగ.

తన తండ్రి చనిపోయిన సమాచారం యక్షదత్తుడికి తెలీదు. అతను యుద్ధ యత్నాలలో చురుకుగా పని చేస్తున్నాడు. కొద్ది రోజులలో పన్నులు వసూలు చెయ్యి టానికి దస్యు సైనికులు వచ్చారు. యక్ష దత్తుడు వారిని చావగొట్టించి పంపేశాడు. దస్యురాజు ఉగ్రుడై తారాద్వీపం మీదికి పెద్ద సేనను పంపాడు. యక్షదత్తుడు దస్యుల పడవలను సముద్రంలో ముంచీ, దస్యు సైనికులతో తమ సైనికుల చేత పోరా డించీ, తానే తన అమోఘమైన కత్తితో వందలాది దస్యులను చంపీ గొప్ప విజయం సాధించాడు. యుద్ధంలో సాలంకులు కూడా అద్భుత శౌర్యపరాక్రమాలు చూపాతు.




యుద్ధం ముగిసిన మరుక్షణం యక్ష దత్తుడు తన తండ్రి కోసం వెతికి, జరిగిన సంగతి తెలుసుకున్నాడు. అతని రక్తం ప్రజ్వలించింది. అతను తండ్రికి ఉత్తర క్రియలు చేసి రాజధాని చేరే సరికి రాజు గొప్పగా విజయోత్సవం జరుపుతున్నాడు.

యక్షదత్తుడు నిండు సభలో ప్రవేశించి, సందడిగా ఉన్న సభలో నిలబడి రెండు చేతులూ ఎత్తాడు. "మన వీరాధివీరు డేదో చెప్పుతున్నాడు, వినండి," అన్నాడు రాజు.

"మహారాజా, ఎవరైనా మీ తండ్రిగారిని హత్య చేస్తే వారి కేమిటి శిక్ష?" అని అడి గాడు యక్షదత్తుడు.




"శిరశ్ఛేదమే! నీ కెందు కా సంశయం కలిగింది?" అన్నాడు రాజు.

"నా తండ్రిని హత్య చేసినవా రీ సభలో ఉన్నారు. వారిని తగిన విధంగా శిక్షించ వలసిందిగా తమరిని వేడు కుంటున్నాను," అన్నాడు యక్షదత్తుడు.

"వా రెవరో చెబితే, నేరవిచారణ జరిపి, హంతకులని రుజువైతే వాళ్ళ తలలు తీయి స్తాను," అన్నాడు రాజు.

"నేను వారి తలలు కోరను. నా తండ్రి హత్యకు వారు తగిన పరిహారం చెల్లిస్తే చాలు, నేను తృప్తిపడతాను," అన్నాడు యక్షదత్తుడు.

వెంటనే సాలంకులు ముగ్గురూ లేచి నిలబడి, "నీవు కోరే పరిహారం ఏమిటి?" అని అడిగారు.

"మూడు వెలగకాయలూ, ఒక తోలు సంచీ, ఒక ఈటే, ఒక కుక్కపిల్లా, ఒక పెనమూ నేను కోరే పరిహారం," అన్నాడు యక్షదత్తుడు.

"ఇందులో ఏదో కిటుకున్నది. నీ తండ్రి హత్యకు ఇంత కొద్దిపాటి పరిహారం కోరుతా వంటే ఎవరు నమ్ముతారు?" అన్నాడు సాలంకులలో పెద్దవాడు.

"ఇంకా వివరంగా చెబుతాను. నేను కోరే వెలగకాయలు తూర్పు దీవిలోని ఒక తోటలో ఉన్నాయి. అవి బంగారు రంగులో ఉంటాయి. అవి మనిషితల ప్రమాణంలో ఉంటాయి. వాటి గుజ్జు తేనె రుచి గలిగి, ఎలాటి గాయాలను గాని, రోగాలను గాని నయం చేస్తుంది. యవనద్వీప రాజు వద్ద నేను కోరే తోలుసంచి ఉన్నది. అది కూడా ఎంతేసి గాయాలనూ, వ్యాధులనూ స్పర్శ మాత్రాన నయం చేస్తుంది. నేను కోరే ఈటె ప్రవాళద్వీప రాజు వద్ద ఉన్నది. దాని మొన తాకిన వాళ్ళు నిలువునా భస్మమై పోతారు. అది మామూలుగానే నిప్పులు కక్కుతూ ఉంటుంది. అందుచేత

దాని ములికిని ఉత్తప్పుడు నీటి తొట్టెలో ఉంచుతారు. కుక్కపిల్ల రాక్షస ద్వీపంలో ఉన్నది. దాన్ని చూసి సింహ వ్యాఘ్రాల వంటి క్రూరమృగాలు సైతం పారిపోతాయి. నేను చెప్పిన పెనం వారుణ ద్వీపంలో ఉన్నది. ఆ ద్వీపం ఎక్కడ ఉన్నదీ తెలుసుకోవటమే అసాధ్యం. అది కావటానికి ద్వీపమే గాని, సముద్రాల పైన ఎక్కడా దాని జాడ కనబడదు. నాకు ఈ పరిహారం చెల్లించినట్టయితే మీకు మరే శిక్ష జరగాలని నేను కోరను," అన్నాడు యక్షదత్తుడు.

సాలంకులు ముగ్గురూ కూడ బలుక్కొని యక్షదత్తుడితో, "నీ జలతారను మా కిచ్చినట్టయితే ఇన్ని చోట్లకూ వెళ్ళి నీవు కోరిన వస్తువులు తీసుకువస్తాం," అన్నారు. యక్షదత్తుడు సరే నన్నాడు.

సాలంకులు జలతార పైన బయలుదేరారు. యక్షదత్తుడు కోరిన వస్తువులలో ఏది తేవాలన్నా ప్రాణాలతో చెలగాటమే నని వారికి తెలుసు. అయినా వారు అంతు లేని ధైర్య సాహసాలు గలవారు కావటం చేత ఈ ప్రయత్నంలో చావటానికి కూడా వారు సిద్ధపడ్డారు.

వారు ముందు తూర్పు దీవికి వెళ్ళి అక్కడి బంగారు వెలగపళ్ళ చెట్టును



దూరం నుంచి చూశారు. ఆ చెట్టు కింద ముగ్గురు విలుకాళ్ళు కాపలా ఉన్నారు. సాలంకులు మూడు డేగలను ఆ చెట్టు దిక్కుగా వదిలారు. చెట్టు కింద కాపలా ఉన్న వాళ్ళు వాటిని చూసి బాణాలు ఎక్కుపెట్టే లోపుగా అవి కొంత దూరంలో ఎగురుతూ అటూ ఇటూ తిరగసాగాయి. కాపలావాళ్ళు వాటిని కొట్టటం కోసం చెట్టు కింది నుంచి వెళ్ళి పోయారు. ఆ సమయంలో సాలంకులలో ఒకడు చెట్టెక్కి బంగారు వెలగ కాయలను కోసుకుని దిగి వచ్చాడు. ఈ లోపుగా కాపలా వాళ్ళు మోసం గ్రహించి వారిపై బాణాలు విసి



రారు గాని, వాటిని తప్పించుకుని సాలంకులు "జలతార" లో వచ్చి పడ్డారు.

తరవాత సాలంకులు తమ పడవలో యవనద్వీపాన్ని చేరుకుని అక్కడి రాజు వద్దకు భట్రాజుల వేషాలు ధరించి వెళ్ళి, ఆయన పైన స్తోత్ర పాఠాలు చదివి, పద్యాలు చెప్పారు. రాజు ఏం బహుమానం కావాలో కోరుకోమన్నాడు. సాలంకులు ఆయన వద్ద ఉండే తోలుసంచీ అడిగారు.

దాన్ని దేవు డడిగినా ఇవ్వను, కావలిస్తే దానినిండా బంగారం కొలిచి ఇస్తాను పట్టుకు పొమ్మన్నాడు యవనరాజు. రాజుగారి భటుడు తోలుసంచిని బంగారంతో



నింపు తుండగా సాలంకులలో పెద్దవాడు ఆ సంచీని లాగేసుకున్నాడు. రెండోవాడు భటుణ్ణి కత్తితో పొడిచాడు. దారిలో తమను అటకాయించిన వారి నందరినీ చంపేస్తూ, ఆ ముగ్గురూ తమ పడవను చేరుకుని ప్రయాణమయారు.

అక్కడి నుంచి వారు ప్రవాళద్వీపానికి వెళ్ళి, పండితుల వేషాలు ధరించి రాజదర్శనం చేసి, తాము తారాద్వీప ఆస్థాన పండితుల మనీ, లోక సంచారం చేస్తున్నా మనీ చెప్పారు. రాజు సంతోషించి, వారిని సత్కరించి, తన వద్ద ఉన్న వింతలతో బాటు నిప్పులు కక్కే ఈటెను కూడా చూపాడు. సాలంకులలో ఒకడు ఈటెను అమాయికంగా నీళ్ళ తొట్టె నుంచి పైకి తీసే సరికి దాని మొన నుంచి నిప్పురవ్వలూ, పొగలూ చిమ్మాయి. రాజు దాన్ని తాక వద్దని కేకలు పెట్టాడు. గందరగోళం జరిగింది. ఆ గందరగోళంలో సాలంకులు పారిపో జూచారు. కాని రాజు మోసం గ్రహించి, తన భటులను కేకపెడుతూ, కత్తి దూసి సాలంకుల పై కలియబడ్డాడు. సాలంకులు రాజును చంపి, రాజభటులతో చాలాసేపు ఘోరంగా పోరాడి, అందరినీ చంపి, తాము గాయపడి, ఎలాగో పడవను చేరుకున్నారు.



ఇంక రాక్షస ద్వీపానికి వెళ్ళి కుక్క పిల్లను తేవాలి. పోయినకొద్దీ తమకు ప్రాణాపాయం హెచ్చుతున్నదని తెలిసి కూడా, వారు యక్షదత్తుడు కోరిన పరిహారం చెల్లించటానికే నిశ్చయించారు. అయితే, రాక్షస రాజు వాళ్ళను చూస్తూనే, "మీరు సాలంకులు కారా? నా వల్ల మీ కేం సహాయం కావాలి?" అని అడిగాడు.

వాళ్ళు ఆశ్చర్యపోయి, "సింహ శార్దూలాలను భయపెట్టే కుక్కపిల్ల ఉన్నదట. అది కావాలి," అన్నారు.

"తీసుకు పొండి. మీ సాహసకృత్యాలు మాకు తెలియ వచ్చాయి. నే నీ కుక్క పిల్ల నివ్వనంటే మీరు తీసుకోకుండా ఉంటారా? అందుచేత స్నేహపూర్వకంగానే తీసుకోండి," అన్నాడు రాక్షసరాజు.

సాలంకులు అతనికి కృతజ్ఞత తెలిపి, "మీ కెప్పుడు ఏ యుద్ధాలలో మా సహాయం కావాలన్నా కాకి చేత కబురు పంపితే మేం వచ్చి వాలుతాం," అని రాక్షసరాజు వద్ద సెలవు పుచ్చుకున్నారు.

ఇంక వాళ్ళు వారుణద్వీపం నుంచి ఒక పెనం తీసుకు రావలసి ఉన్నది. కాని ఆ వారుణద్వీపం ఎక్కడ ఉన్నదీ వాళ్ళకు అంతు చిక్కలేదు. అది తూర్పు సముద్రంలోనే ఏ ప్రాంతాలనో నీటి మట్టానికి నూరు





ద్వీపాన్ని వెతుక్కుంటూ అప్పుడే బయలు దేరవచ్చు.

ఇలా అనుకుని సాలంకులు తారాద్వీపా నికి తిరిగి వచ్చి, యక్షదత్తుడికి తాము తెచ్చిన వెలగకాయలూ, తోలుసంచీ, నిప్పులు కక్కే ఈటె, కుక్కపిల్లా ఇచ్చి, "యక్షదత్తా, నీ పరిహారం చెల్లినట్టేనా?" అని అడిగారు.

"ఇంకా వారుణద్వీపం నుంచి మీరు పెనం తెచ్చి ఇవ్వవలిసి ఉంది," అన్నాడు యక్షదత్తుడు.

సాలంకులు మరొక సారి "జలతార"ను అరువు తీసుకుని తూర్పు సముద్రం కేసి బయలుదేరారు.

నిలువుల లోతున ఉంటుందని రాక్షసరాజు వాళ్ళకు చెప్పాడు. అక్కడ బహు క్రూరులూ, మహాబలులూ అయిన జల రాక్షసు లుంటారట.

సాలంకులు తమలో తాము కూడబలు క్కుని వారుణద్వీపానికి వెళ్ళకుండా తిన్నగా తారాద్వీపానికి వెళ్ళి, తాము సాధించి తెచ్చిన వాటితో యక్షదత్తుడు తృప్తి పడతాడేమో చూతా మనుకున్నారు. ఎందు కంటే మిగిలిన వస్తువుల మహిమలు చెప్పాడు గాని, యక్షదత్తుడు ఆ పెనానికి ఏ మహత్తూ ఉన్నట్టు చెప్పలేదు. పెనం తెచ్చి తీరాలని పట్టుబడితే, వారుణ

యక్షదత్తుడు తాను పరిహారంగా పుచ్చు కున్న వాటి నన్నిటినీ తారాద్వీప రాజుకు సమర్పిస్తూ, "మహారాజా, దస్యు లీ సారికి మన చేతిలో ఓడారే గాని, మన పైకి మరింత పెద్ద సేనతో ఎప్పుడు వచ్చి పడినా పడవచ్చు. అప్పుడు వారిని జయించటానికి ఈ వస్తువు లన్నీ మనకు అవసరం. అందు చేత వీటిని మీ అధీనంలో జాగ్రత్తగా ఉంచండి," అన్నాడు.

సాలంకులు సువర్ణద్వీపంలో కొంతకాలం ఉండి, అక్కడి వాళ్ళ వద్ద సముద్రం

అడుగున దీర్ఘకాలం ఉండే విద్య నేర్చుకున్నారు. వారు అనేక మాసాల పాటు తూర్పు సముద్రం అంతా గాలించి, చివరకు వారుణద్వీపం కనిపెట్టారు. వారుణ ద్వీపం నూరు నిలువుల లోతునే ఉన్నది గాని, దాని చుట్టూ ఉండే సముద్రం అనేక వేల నిలువుల లోతున్నది. ఆ ద్వీపం మీద భయంకరమైన జలరాక్షసు లుంటున్నారు.

సాలంకులు రాత్రి వేళ ఆ ద్వీపం మీదికి దిగి ఒక జలరాక్షసి ఇంట ప్రవేశించి, ఎలాగైతేనేం ఒక పెనం పట్టుకున్నారు. వారు దానితో బయటికి వస్తుండగా ఇద్దరు జలరాక్షసులు వారిని తరిమి పట్టుకుని, తమ వాడి గోళ్ళతో కండలు పీక సాగారు. ఇద్దరు సాలంకులు ఆ రాక్షసులకు వశులై పోయి ఏమీ చెయ్యలేని స్థితిలో ఉండగా మూడో వాడు కత్తితో పోరాడి, ఇద్దరు రాక్షసులనూ చంపి, తన తమ్ముల నిద్దరినీ చెరొక చంకనా వేసుకుని, నీటి పైన ఉన్న "జలతార"లో చేర్చాడు.

ముగ్గురూ బాగానే గాయపడ్డారు. కాని పెద్దవాడి కన్న మిగిలిన ఇద్దరూ మరింత తీవ్రంగా గాయపడి స్పృహ తప్పి కొస ప్రాణంతో ఉన్నారు. తన యజమాని మనసు తెలుసుకుని నడవగల "జలతార"




అతి వేగంగా బయలుదేరి, తారాద్వీపం చేరుకుని, నీటి ఒడ్డున ఆగక, తిన్నగా రాజభవనం ప్రవేశించింది.

సాలంకులలో పెద్దవాడు తాను తెచ్చిన పెనాన్ని యక్షదత్తుడికి అందిస్తూ, "నీ రుణం తీరింది. మేం ప్రాణాలు విడుస్తున్నాం," అని పడిపోయాడు. మిగిలిన ఇద్దరూ అదివరకే ప్రాణం పోయినట్టుగా పడి ఉన్నారు.

యక్షదత్తుడు వెంటనే తోలుసంచీ తెప్పించి సాలంకుల గాయాలన్నిటినీ దానితో తుడిపించాడు. కొద్దిసేపటి కల్లా వాళ్ళు కోలుకుని, బతికి బయటపడ్డారు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నాకొక్క సందేహం. యక్షదత్తుడు తన తండ్రిని హత్య చేసిన సాలంకులు చావాలనే కదా పరిహారం కోరాడు? ముఖ్యంగా జలరాక్షసుల నుంచి పెనం కోరటం అందుకే గదా? అలాటప్పుడు అతను వారి నెందుకు బతకనిచ్చాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "యక్షదత్తుడు సాలంకుల చావు కోరినట్టు ఎక్కడా కనబడదు. అతను కోరి ఉంటే తారాద్వీప రాజు వారిని శిరశ్ఛేదం చేసి ఉండును. ఎందుకంటే తారాద్వీపానికి యక్షదత్తుడు చేసిన సేవ అపారమైనది. అతను తన పరిహారం కోరటంలో కూడా తారాద్వీపానికి ముందుముందు దస్యుల భయం రాకుండా ఉండటమే ఆశయంగా పెట్టుకున్నాడు. సాలంకులను జలరాక్షసుల పైకి పంపటంలో అతనికి దురుద్దేశం ఉన్నట్టు కనపడేమాట నిజమేగాని, అందులో కూడా అతను మేలే ఆలోచించాడు. జలరాక్షసుల వాతపడి కూడా ప్రాణాలతో తిరిగి వచ్చిన సాహసవంతులు తారాద్వీపంలో ఉన్నారని తెలిస్తే దస్యులు తారాద్వీపం మీదికి మరొకసారి రావటానికే భయపడతారు. సాలంకుల సాటిలేని పరాక్రమం అదివరకే ప్రచారమయింది. కనుకనే రాక్షస ద్వీపవాసులు కూడా వారితో తగాదా పెట్టుకోలేదు. తమ మధ్య సాలంకుల వంటి ప్రతాపశాలు లున్నారంటే తారాద్వీప యువకులు ధైర్యసాహసాలు తెచ్చుకుంటారు. అందుచేత యక్షదత్తుడు మొదటి నుంచి చివరదాకా తారాద్వీపం యొక్క శ్రేయస్సునే కోరాడని చెప్పాలి," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# బ్రహ్మముడి

పూర్వం కాశీనగరంలో రాజపాలు డనే యువకు డొక డుండేవాడు. అతనికి పసితనం లోనే తల్లిదండ్రులు పోయారు. అతను ఉన్నతోద్యోగుల సహకారంతో శ్రద్ధగా చదువుకుని, దివాణంలో ఒక ఉద్యోగం కూడా సంపాదించాడు.

ఉద్యోగం దొరికాక రాజపాలుడికి పెళ్ళి మీద బుద్ధి మళ్ళింది. తల్లిదండ్రు లున్నట్టయితే అతనికి అదివరకే పెళ్ళి అయి ఉండేది; ఈ పాటికి భార్య కాపరానికి వచ్చి, సంసారం ఏర్పాటై ఉండేది. భార్య లేని కారణం చేత అత నింకా సత్రంలో భోజనమూ, మఠంలో నిద్రా అన్నట్టుగా జీవితం గడపవలిసి వచ్చింది.

ఇతరుల సహాయం లేకుండా పెళ్ళాడటం సాధ్యం కాదని తెలుసుకుని, రాజపాలుడు తన మిత్రు డొకడితో తన మనసులో ఉన్న మాట చెప్పుకున్నాడు.

"ఫలాని న్యాయాధికారిగారి కొక పెళ్ళి కావలిసిన కూతు రున్నది. అన్ని విధాలా నీకు తగిన పిల్ల. ఇవాళ రాత్రే నేను వారికి నీ విషయం చెప్పి, శత విధాల వారిని ఒప్పిస్తాను. రేపు అరుణోదయం వేళకు మణికర్ణికాఘట్టం వద్ద మెట్ల మీద మనం కలుసుకుందాం. నీ వక్కడికి రా. నా ప్రయత్నం ఏ మయినదీ నీకు చెబుతాను," అన్నాడు మిత్రుడు.

ఆ రాత్రి రాజపాలుడికి కన్ను మూత పడలేదు. నాలుగో జాము ఆరంభంలోనే అతను బయిటికి చూసి, అప్పుడే తెల్లవారి పోయిం దనుకుని, గబగబా మణికర్ణికా ఘట్టానికి బయలుదేరాడు.

అతను ఉదయ కాంతి అనుకున్నది వెన్నెల. మణికర్ణికాఘట్టం నిర్జనంగా ఉన్నది. రాజపాలుడు తన స్నేహితుడి కోసం చాలా సేపు వేచి ఉండవలిసి వస్తుం

పి. కోదండరావు




దనుకుంటూండగా, దూరాన మెట్ల మీద ఎవరో కూర్చుని ఉండటం కనబడింది. ఆ మనిషితో కబుర్లు చెబుతూ కాస్సేపు కాలక్షేపం చెయ్యవచ్చు గదా అని రాజపాలు డాయనను సమీపించాడు.

మెట్ల మీద కూర్చుని ఉన్నవాడు వృద్ధుడు. ఆయన వెన్నెల కాంతిలో పత్రాల పైన ఏదో రాస్తున్నాడు. రాజపాలుడు ఆ వృద్ధుడి వెనక నుంచి తొంగి చూశాడు, కాని వృద్ధుడు రాస్తున్న లిపి చాలా వింతగా ఉన్నది.

"తాతగారూ, నేను అనేక లిపులు ఎరుగుదును. మీరు రాస్తున్న లిపి ఏమిటో నా కేమాత్రం బోధపడ లేదు," అన్నా డతను వృద్ధుడితో.

వృద్ధుడు తల ఎత్తి చూసి, "నీ కెలా అర్థ మవుతుంది? ఇది బ్రహ్మలిపి," అని మళ్ళీ తన రాతలో నిమగ్నుడయాడు.

"తమరు రాసే దేమిటి?" అన్నాడు రాజపాలుడు.

"సూర్యోదయం లోపుగా పుట్టేవాళ్ళ జాతకాలు," అన్నాడు వృద్ధుడు తల ఎత్తకుండానే.

ఆ వృద్ధుడే బ్రహ్మ అయి ఉంటాడా అని రాజపాలుడికి అనుమానం వేసి, అంతు లేని ఆశ్చర్యం కలిగింది.

కొంత సేపటికి వృద్ధుడు రాయటం పూర్తి చేసి, పత్రాలు కట్టగట్టి ఒక పక్క పెట్టి, రెండో పక్క నుంచి ఒక సంచీ తీసి, అందులో నుంచి ఎర్ర పోగులూ, తెల్ల పోగులూ తీసి వాటికి ముడులు వెయ్యనారంభించాడు.

"తాతగారూ, మీరు వేసే ఆ ముళ్ళేమిటి?" అని రాజపాలు డడిగాడు.

"బ్రహ్మముళ్ళు. ఏ పురుషుడికి ఏ ఆడది రాసిపెట్టి ఉన్నదో వాళ్ళకు ముళ్ళు పెట్టేస్తున్నాను," అన్నాడు వృద్ధుడు తల ఎత్తకుండా, తన పని తాను చూసుకుంటూ.

"అయితే నాకు ఎవరు ముడి పడి ఉన్నదీ తమకు తెలిసే ఉంటుంది. మరి కాస్సేపటిలో నా వివాహం స్థిరమైనట్టు వార్త వస్తుందని ఎదురు చూస్తున్నాను," అన్నాడు రాజపాలుడు.

వృద్ధుడు తల ఎత్తి అతని కేసి చూసి, "నీ పెళ్ళి ఇంతలో జరగదు. నీకు కాబోయే భార్య ఇప్పు డింకా మూడేళ్ళ పిల్ల. ఆ పిల్లకు పదిహేడో ఏడు వచ్చే దాకా మీ ఇద్దరికీ వివాహం జరగదు," అన్నాడు.

"ఇంకా పధ్నాలుగేళ్ళ దాకా నా పెళ్ళి కాదా? ఎంత దారుణం! నేను నమ్మను," అన్నాడు రాజపాలడు.

"అలా చూడు, ఆ వచ్చే ఒంటి కన్ను దాని చంక నున్నదే నీకు కాబోయే భార్య," అన్నాడు వృద్ధుడు.

రాజపాలుడు గబగబా మెట్లెక్కి వచ్చి ముసలిదాన్ని సమీపించాడు. ఆ ముసలి దానికి ఒక కన్ను గుడ్డి; కుళ్ళు గుడ్డలు కట్టుకుని ఉన్నది. అది పిల్లను పై మెట్టు పైన కూర్చోబెట్టి, గంగలో స్నానం చెయ్యటానికి మెట్లు దిగి వెళ్ళింది. ఆ పిల్లకు మూడేళ్ళ వయసే ఉంటుంది. ఆ పిల్ల ఆ ముసలిదాని కూతురై ఉంటుంది.

ఆ పిల్ల తనకు భార్య అవుతుందంటే రాజపాలుడికి భరించరాని రోత కలిగింది.





వృద్ధుడి కోసం చూస్తే ఎక్కడా కనబడ లేదు. ఆ వృద్ధుడి మాటలు నమ్మాలో, నమ్మ రాదో రాజపాలుడు నిర్ణయించుకో లేకపో యాడు. ఆ పిల్లను చంపేస్తే గాని అతనికి మనస్సు స్థిమిత పడేటట్టు లేదు.

అతను తన మిత్రుడి కోసం ఇంక వేచి ఉండ దలచలేదు. అతను తలపెట్టిన పని నెరవేరి ఉంటే, అతడు లోగడ చెప్పినట్టు ఈ పాటికి వచ్చి తనను కలుసుకునేవాడే పని జరిగి ఉండదు.

అలా అనుకుని రాజపాలుడు ఊళ్ళోకి బయలుదేరాడు. కొద్ది దూరం వెళ్ళే సరికే అతనికి తెలిసిన దివాణం నౌక రొకడు కని పించాడు. రాజపాలుడు వాణ్ణి దగ్గిరికి పిలిచి, "ఒరే, చిన్న పిల్ల రూపంలో ఒక పిశాచి ఉన్నది. దాన్ని కత్తితో పొడిచి చంపా వంటే నీకు పది వరహాలు బహుమాన మిస్తాను," అన్నాడు.

"పిశాచిని చంపాలిసిందే. అది ఎక్కడ ఉన్నదో చూపించండి, ఇప్పుడే చంపి వస్తాను," అన్నాడు నౌకరు.

రాజపాలుడు వాణ్ణి వెంటబెట్టుకుని వెనక్కు వచ్చే సరికి, ఒంటి కంటిది స్నానం పూర్తి చేసి పిల్ల నెత్తుకుని నది నుంచి వెళ్ళి పోతూ కనబడింది. "అదుగో, ఆ మనిషి చంకలో ఉన్న పిల్లే! నీ పని పూర్తి చేసి నా దగ్గిరికి రా!" అని చెప్పి రాజపాలుడు, శిశుహత్య కళ్ళారా చూడలేక అక్కడ నుంచి త్వరగా వెళ్ళిపోయాడు.

నౌకరు ముసలి దాన్ని కలుసుకుని, దాని వెనకనే నడుస్తూ, చల్లగా కత్తి పైకితీసి, పిల్లను పొడవబోయే సమయానికి, ముసలి దాని చంకలో ఉన్న పిల్ల దైవికంగా వాడి కేసి పెద్ద కళ్ళతో చూసింది. ఆ కళ్ళు చూస్తే నౌకరుకు ఆమె మామూలు పిల్లే అనిపించింది. ఆ పిల్లను హత్య చెయ్యి టానికి వాడికి చేతులాడక, ఎత్తిన కత్తితో పిల్ల కనుబొమ్మ మీదుగా చిన్న గాటు

పెట్టి, కాలి సత్తువ కొద్దీ అక్కడి నుంచి పారిపోయాడు.

వాడు తరవాత రాజపాలుడి వద్దకు వెళ్ళి, పిశాచిని చంపానని చెప్పి, తన బహుమానం తాను పుచ్చుకున్నాడు.

రాజపాలుడు శిశుహత్య చేయించినందుకు బాగానే పశ్చాత్తాప పడ్డాడు గాని, తన కా అలగా పిల్ల భార్య కాకుండా తప్పిపోయినందుకు చాలా సంతోషించాడు. అతను పెళ్ళాడటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు గాని, ఒక్కటీ కలిసిరాలేదు. ఏళ్ళు దొర్లి పోయాయి. రాజపాలుడు ఉద్యోగంలో కూడా పైకి వచ్చాడు.

పధ్నాలుగేళ్ళు గడిచాయి. రాజపాలుడి పైన ఒక కొత్త న్యాయాధికారి వచ్చాడు. పనిలో రాజపాలుడి సమర్థతా, నిజాయితీ చూసి ఆయన చాలా సంతోషించి, అతని కింత వయసు వచ్చినా ఇంకా పెళ్ళి కాలేదని విని ఆశ్చర్యపడ్డాడు.

"పెళ్ళి చేసుకుందామని ఎంతో కాలంగా చూస్తున్నాను. ఒక్క ప్రయత్నమూ కలిసి రాలేదు," అన్నాడు రాజపాలుడు.

"నాకు పెళ్ళియీడు కూతు రున్నది. చాలా అందగత్తె. బాగా చదువుకున్నది. పని పాటలలో సమర్థురాలు. ఆమెను చేసుకో," అన్నాడు అధికారి.



రాజపాలుడు సంతోషంగా ఒప్పు కున్నాడు. అధికారి కుమార్తెను అతనికిచ్చి పెళ్ళి చేశారు. ఒంటి నిండా రత్నాభరణాలు దిగవేసుకుని పెళ్ళికూతురు అపరమోహిని లాగుంది. ఆమె కాపరానికి వచ్చాక రాజ పాలుడికి జీవితం స్వర్గతుల్యంగా అయింది.

అయితే తన భార్య తన జుట్టును నుదుటిలో కుడిభాగం కప్పుకునే లాగా దువ్వుకుని, అక్కడ ఒక ఆభరణం అమ ర్చుతూ ఉంటుంది. మిగిలిన నగలన్నీ పెట్టెలో దాచినప్పుడు కూడా ఆమె ఆ ఆభ రణాన్ని తియ్యదు.

దీన్నిగురించి రాజపాలు డొకసారి ప్రశ్నిస్తే ఆమె, "నేను మూడేళ్ళ దాన్నయి ఉండగా ఒక దుర్మార్గుడు నన్ను కత్తితో పొడిచి చంపాలని ప్రయత్నించి, నుదిటి మీద చిన్న గాటు పెట్టి పారిపోయాడు. ఆ మచ్చ వికారంగా ఉంటుందని జుట్టు ఇలా దువ్వు కుంటాను," అన్నది.

రాజపాలుడు నిర్ఘాంతపోయి, "అయితే ఆ రోజు నిన్ను నది దగ్గరకు ఎత్తుకు వచ్చిన ఒంటి కంటిది మీ అమ్మ కాదా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు ఆమె మరింత నిర్ఘాంత పోయి, "ఆ మనిషి మీ కెలా తెలుసు? అది నన్ను పెంచిన దాది. నేను ఈ అధి కారి సొంత కూతురును కాను, అన్న కూతు రును. నాకూ కూడా మీలాగే చిన్న తనం లోనే తల్లిదండ్రులు పోయారు. ఆ ఒంటి కంటి దాదే నన్ను పెంచింది. మా పిన తండ్రి నన్ను పెంపుడు చేసుకున్నాడు," అని చెప్పింది.

రాజపాలుడు ఏమీ దాచకుండా తన భార్యతో జరిగిన దంతా చెప్పాడు. ఆమె అతని దుస్సంకల్పాన్ని గురించి ఆగ్ర హించక, "అయితే మీ రా నాడు మణికర్ణి కాఘట్టంలో చూసినది నిజంగా బ్రహ్మ దేవుడే అయి ఉంటాడు," అన్నది.







# గడ్డి చొక్కా

చాలాకాలం క్రితం జపాను లోని ఒక గ్రామంలో ఓటోకో అనే పనికిమాలిన అల్లరి వెధవ ఒక డుండేవాడు. వాడు ఊళ్ళో వాళ్ళను రకరకాలుగా పీడించి, వాళ్ళ చేత తిట్లూ, తన్నులూ తింటూండేవాడు. వాడికి ఏ పనీ చేతగాదు.

ఒక రోజున వాడు ఏమీ తోచక ఒక వెదురు కర్ర తీసుకుని, దాని కణుపులను తొలిచి, పొడుగాటి గొట్టం తయారుచేసి, దాన్ని కంటికి పెట్టుకుని, దుర్భిణిలో నుంచి చూసినట్టు చూసే సరికి, గాలిలో ఎగురుతూ టెంగు అనే జాతికి చెందిన పిశాచి ఒకటి కనిపించింది. దాన్ని ఏడిపించాలని ఓటోకో నిశ్చయించుకున్నాడు.

టెంగుజాతి పిశాచాలు ఆ కాలంలో జపానులో అప్పుడప్పుడూ మనుషులకు కనిపిస్తుండేవి. అయితే వాటి జోలికి పోవటం చాలా ప్రమాదం. ఓటోకో వంటి మూర్ఖులు తప్ప మామూలు మనుషులు వాటికి సాధ్యమైనంత దూరంగా ఉంటారు.

ఓటోకో చూసిన టెంగుపిశాచికి చాలా పొడవైన ముక్కున్నది. దాని భుజాల మీద అలంకారంగా రెండు రెక్క లున్నాయి. అది ఎండుగడ్డితో అల్లిన చొక్కా ఒకటి ధరించి ఉన్నది. ఆ పిశాచం తన కేసే ఎగిరి వస్తూండటం చూసి, ఓటోకో దాని గడ్డి చొక్కా ఎలాగైనా కాజెయ్యా లనుకున్నాడు.

పిశాచం నేల మీద దిగే సమయానికి ఓటోకో వెదురు గొట్టంలో నుంచి ఆకాశం కేసి చూస్తూ, "ఆహా! ఓహో! అద్భుతం!" అంటున్నాడు. పిశాచానికి పట్టరాని ఆసక్తి పుట్టుకొచ్చి, ఓటోకో చుట్టూ గెంతుతూ, పీల గొంతుతో, "ఏమిటది? నన్ను కూడా కాస్త చూడనీ," అన్నది.

"ఏమిటీ? నేను కష్టపడి చేసుకున్న దుర్భిణిని నీ కిమ్మంటావా? ఇంకా

జపాను జానపద కథ



నయం!...ఓహో! దీనిలో నుంచి చూస్తే చంద్రుడెంత అందంగా ఉన్నాడు! ఏ మా పర్వతాల అందం! ఆ లోయల చందం!" అన్నాడు ఓటోకో.

వాడు చంద్రుణ్ణి వర్ణిస్తున్న కొద్దీ పిశాచానికి చంద్రుణ్ణి ఆ దుర్భిణి లోంచి చూడాలన్న తహతహ జాస్తి అయింది. ఆ గొట్టంలో తనను చూడనిస్తే, అది ఓటోకోకు తన చెప్పు లిస్తానన్నది. తన టోపీ ఇస్తా నన్నది. పిశాచం తన గడ్డిచొక్కా ఇస్తానన్న దాకా ఓటోకో బెట్టు చేసి, వెదురు గొట్టాన్ని పిశాచాని కిచ్చి, దాని గడ్డిచొక్కా తీసుకుని అదే పోత పోయాడు. పిశాచం పాపం, ఎంత సేపు గొట్టంలో నుంచి చూసినా ఏమీ కనబడనే లేదు.

పిశాచం కనుచాటు కాగానే ఓటోకో గడ్డిచొక్కా తొడుక్కుని, తక్షణమే అదృశ్యుడై పోయాడు. వాడితో బాటు చొక్కా కూడా అదృశ్యమైపోయింది. ఓటోకో ఆనందానికి మేర లేదు. వాడు ఎగురు కుంటూ గ్రామంలోని పెద్ద వీధికి వెళ్ళి, రకరకాల ఆకతాయి వేషాలు వెయ్య సాగాడు—మనుషుల నెత్తి మీద ఉండే బరువులు పడదోశాడు; దుకాణాల లోని వస్తువులు చిందర వందరగా పారేశాడు; మనుషుల ముక్కులు పిండాడు.

వీధిలో జనం కంగారెత్తి పోయారు. ఎక్కడివా ళ్ళక్కడ దాక్కుని వీధి కేసి వింతగా చూడ సాగారు. వీధి త్వరలోనే నిర్మానుష్య మయింది గాని, వింత చేష్టలింకా జరుగుతూనే ఉన్నాయి. నిర్జనమైన వీధి వెంట ఒక గొప్పవాడు ఠీవిగా నడుస్తూ వచ్చాడు. అకస్మాత్తుగా ఆ గొప్పవాడి ఎడమ చెవిని ఎవరో మెలిపెట్టి నట్టయింది. ఆయన ఆగ్రహావేశంతో వెనక్కు తిరిగే సరికి, ఎవరో ఆయన కుడి చెవిని పట్టుకుని గుండ్రంగా తిప్పారు. ఆయన కూలబడి చుట్టూ కలయ చూస్తుంటే, తలుపుల చాటు నుంచీ కిటికీల చాటు నుంచీ ఈ దృశ్యాన్ని

చూస్తున్న జనానికి భయంతో బాటు, పొట్ట చెక్కలయ్యే నవ్వు కూడా వచ్చింది. ఎందుకంటే అంత ఠీవి గల గొప్పవాడూ, తనకు తానై వెర్రి పనులు చేస్తున్నట్టు వాళ్ళకి కనిపించింది.

ఇంతలో ఎవరో రైతు ఖరీదైన బట్టలు కొని, వాటిని చేత బట్టుకుని వస్తున్నాడు. అకస్మాత్తుగా ఆ మనిషి చేతిలో ఉండే బట్టలు గాలిలోకి తేలి దూరంగా వెళ్ళిపోయి, అటూ ఇటూ సంచారం చెయ్య సాగాయి. అవి అలా వెళ్ళి, వెళ్ళి, వీధి పక్కన ఉన్న మురుగుగుంటలో టప్పున పడిపోయాయి.

మరొక చోటికి అప్పుడే పట్టిన చేపలు వచ్చాయి. రాత్రి వంటకు చేపలు కొన వచ్చిన స్త్రీలు తమకు కావలిసిన చేపలను ఏరి కొనుక్కుంటున్నారు. అంతలో ఒక పెద్ద చేప, ప్రాణం వచ్చినట్టుగా, చివాలున గాలిలోకి లేచి, తేలుతూ వెళ్ళిపోసాగింది. చేప లమ్మేవాళ్ళు దాని వెంట పడ్డారు. వాళ్ళు దాన్ని సమీపించే సమయానికి అది వాళ్ళ కాళ్ళ ముందు పెద్ద చప్పుడుతో పడిపోయి, దుమ్ము కొట్టుకున్నది.

ఇలా కొంత సేపు ఆకతాయితనం చేసి అలిసిపోయి, ఓటోకో ఇంటికి వెళ్ళాడు. వాడు ముందు వాకిలి కుండా లోపలికి వచ్చి,





గడ్డిచొక్కా విప్పి, మళ్ళీ తన సహజ రూపంతో కనిపించేసరికి, వాడి తల్లి ఉలిక్కి పడింది. ఎందుకంటే తన కొడుకు లోపలికి రావటం ఆమె చూడనేలేదు.

తన కొడుకు పడుకుని నిద్రపోయాక ఆమె వాడి గడ్డిచొక్కా తీసి చూసి, "ఛీ, ఛీ! ఈ చెత్త చొక్కా వీడి కెక్కడ దొరికింది?" అనుకుని, దాన్ని తీసుకుపోయి పొయిలో పెట్టేసింది. క్షణంలో అది కాస్తా బూడిద అయిపోయింది.

ఓటోకో నిద్ర లేస్తూనే తన గడ్డిచొక్కా కోసం ఇల్లంతా తెగ వెతికాడు. తల్లి నడిగితే, దాన్ని పొయిలో పెట్టానని చెప్పింది. ఓటోకోకు అమితమైన కోపం వచ్చింది. చొక్కా మహిమ బూడిదలో కూడా ఉండ వచ్చునన్న ఆశతో వాడు ఆ బూడిద నంతా ఎత్తి ఒక బుట్టలో చేర్చాడు. తరవాత వాడా బుట్టను దొడ్లో మూలకు తీసుకుపోయి, తన బట్టలన్నీ విప్పేసి, ఆ బూడిదను ఆపాదమస్తకమూ పులుముకో సాగాడు. బూడిద అంటిన తన శరీర భాగాలు అదృశ్యమై పోతూండటం గమనించి వాడికి అంతులేని ఆశ్చర్యం వేసింది. గడ్డి చొక్కాకు గల ప్రభావం, దాని బూడిదలో కూడా ఉన్నదని స్పష్ట మయింది. త్వరలోనే ఓటోకో పూర్తిగా అదృశ్యుడై పోయాడు.

తన ఎత్తు పారినందుకు వాడు పరమా నందం చెంది, పెద్ద వీధి కేసి బయలుదే రాడు. సాయంకాలం కావటం చేత వీధి రద్దీగా ఉన్నది. వాడు అదృశ్యంగా ఆ జనం మధ్య నడుస్తుండగా, "సాకీ" అనే సారాయి అమ్మే దుకాణం నుంచి వాసన కొట్టింది. దుకాణంలో సాకీ తాగవచ్చిన వాళ్ళు చాలా మంది ఉన్నారు. దుకాణదారు ఒక పెద్ద పీపా నుంచి అందరికీ సాకీ ఇస్తున్నాడు.

పీపా దగ్గిర ఎవరూ లేని సమయం చూసి, ఓటోకో పీపా కొళాయి దగ్గర చేరి, కొళాయికి మూతి పెట్టి గడగడా తాగ

సాగాడు. గడగడ శబ్దం దుకాణదారుకు వినిపించింది గాని, అది ఎలా వస్తున్నదీ తెలుసుకో లేకపోయాడు. అతను దగ్గిరికి వచ్చి చూసే సరికి, మనిషి మూతి మాత్రం కనిపించింది. ఎందుకంటే, ఓటోకో మూతికి పూసుకున్న బూడిద సాకీతో కరిగిపోయి, మూతి బయట పడింది. మనిషి లేకుండా మనిషి మూతి మాత్రం ఉండటం చూసి దుకాణదారు దిగ్భ్రమ చెంది చూస్తూండ గానే, సాకీ ధారలు కారి ఓటోకో గడ్డం కొంచెం కొంచెమే బయటపడ సాగింది.

దుకాణదారు పెద్ద పొలికేక పెట్టే సరికి ఓటోకో భయపడి లేచి నిలబడ్డాడు. వాడికి చెమటలు పోయసాగాయి. చెమటతో తడిసిన వాడి శరీర భాగాలు, చెరిగిపోయిన చిత్తరువులో లాగా బయటపడ సాగాయి.

తన ఆట కట్టయిందని తెలుసుకుని ఓటోకో దుకాణంలో నుంచి బయటికి వచ్చి వీధి వెంట పరిగెత్త సాగాడు. దుకాణంలో చేరిన వాళ్ళంతా వాడి వెంట పడ్డారు. ఓటోకో పరిగెత్తి, పరిగెత్తి ఒక కాలవ లోకి దూకాడు. వాడి వంటి మీద బూడిద పూర్తిగా కరిగిపోయింది. వాడు తల బయటికి పెట్టి, చలికి వణుకూ నీటిలో ఉండిపోయాడు.

వాణ్ణి తరుము కొచ్చిన వాళ్ళు ఇప్పుడు ఓటోకోను గుర్తించి, వాణ్ణి పైకి లాగి, వాడి మీద ఒక కిమోనో కప్పారు.

"నీకీ దుర్గతి ఎలా పట్టిందిరా, ఓటోకో?" అని గ్రామ పెద్ద అడిగాడు.

ఓటోకో సిగ్గుపడుతూ తాను టెంగుపిశాచిని మోసం చేసి గడ్డిచొక్కా సంపాదించిన ఉదంత మంతా వాళ్ళకు చెప్పాడు. వాడి కథ విన్నవాళ్ళు విరగబడి నవ్వి, "టెంగు పిశాచినే మోసం చేద్దా మనుకున్నావా? ఎంత మూర్ఖుడివి!" అన్నారు. వాళ్ళు ఆ నవ్వులో వాడు చేసిన ఆకతాయి వేషాలను క్షమించి వదిలేశారు.





# గంగమ్మ గర్వభంగం

ఒక పల్లెటూరులో అనంతయ్యా అనే రైతు ఉండేవాడు. అతనికి గంగమ్మ అనే చెల్లెలు ఉండేది. చెల్లెలంటే అనంతయ్యాకు పంచ ప్రాణాలు, కాని గంగమ్మకు మొదటి నుంచీ గర్వం ఎక్కువ. ఆమెకు అన్నగారంటే కాస్త కూడా గౌరవం లేదు. అయితే అనంతయ్యా దాన్ని గురించి పట్టించుకునేవాడు కాడు. చెల్లెలు సుఖంగా ఉంటే చాలునని అనంతయ్యా మంచి సంబంధం చూసి, తన కున్న రెండెకరాలూ వరకట్నం ఇచ్చి, గంగమ్మకు పెళ్ళిచేశాడు. తరవాత తానొక పేదయింటి పిల్లను చూసి పెళ్ళాడాడు.

గంగమ్మ కాపరానికి వెళ్ళింది, అనంతయ్యా భార్య కాపరానికి వచ్చింది. అతనికి వరసగా పిల్లలు పుట్టుకొచ్చారు. సంసార భారం పెరిగిపోయింది. చివరికా కుటుంబ స్థితి ఎలా అయిందంటే, పని చేసిన నాడు తిండీ, లేని నాడు పస్తూనూ.

పిల్లలు ఆకలికి అల్లాడుతూంటే, ఆ దంపతుల హృదయాలు కుమిలి కుమిలి ఏడ్చేవి. ఆడుతూ పాడుతూ తిరగవలిసిన పిల్లలు తిండి లేక ఎండిపోతుంటే, అనంతయ్యాతో అతని భార్య ఒకనాడు, "ఇంత బాధ పడుతున్నాం కదా, ఒక్కసారి మీ చెల్లెలి దగ్గిరికి పోయి రాకూడదా? తనకు తోచిన సహాయం చేస్తుంది," అన్నది.

"కావాలంటే పోయిరావచ్చు. కాని, వాళ్ళు మాత్రం ఏ మంత కలవారని?" అన్నాడు అనంతయ్యా.

"పోనీ, వెళ్ళి చూసి రండి. పెళ్ళయి అయిదు సంవత్సరా లయింది. మన పరిస్థితి చూసి మీ చెల్లెలు సహాయం చేస్తే సరేసరి, లేకపోతే చూసి వచ్చెయ్యండి," అన్నది భార్య.

ఇక కాదనలేక అనంతయ్యా మర్నాడు తెల్లవారు ఝామున, భార్య ఇచ్చిన గంజి

ఎం. బ్రహ్మం

తాగి, గంగమ్మ అత్తవారి ఊరుకు బయలు దేరాడు. అతను పగలంతా నడిచి, సాయం కాలానికి ఆ వూరు చేరాడు. ఆ వచ్చే అన్న గారిని గంగమ్మ అంత దూరంలోనే చూసింది. అన్న కట్టుకున్న చింకి బట్టలూ, నూనెమొహం ఎరగని చింపిరితలా, ఉపోషాలతో చిక్కిపోయిన శరీరమూ, గుంటలు పడ్డ కళ్ళూ చూసి గంగమ్మ అదురుకున్నది.

ఆమె అన్నను చూసి జాలిపడటానికి బదులు, "పచ్చగా ఉంటే దిష్టి పెట్టటానికి వస్తున్నాడు," అని తన మనస్సులో అనుకుంది.

చెల్లెలు గుమ్మంలో నిలబడటం అనంతయ్య చూశాడు. మళ్ళీ చూసేటప్పటి కామె కనిపించక పోయేసరికి, కాళ్ళకు నీళ్ళు తేవటానికి లోపలికి వెళ్ళిం దనుకున్నాడు. ఈ లోపల గంగమ్మ తన అన్నను ఎలాగైనా త్వరగా సాగనంపాలని నిశ్చయించుకున్నది. ఆమె లోపలికి వెళ్ళి, తాను కట్టుకుని ఉండిన వెలగల పట్టుచీర విప్పేసి, చిరుగులు పట్టి, వెలిసిపోయిన పాత చీర కట్టుకుని, మట్టి పిడతతో నీరు తీసుకుని బయటికి వచ్చింది.

ఒక్క నిమిషంలో తన చెల్లెలిలో కలిగిన మార్పుచూసి అనంతయ్య ఆశ్చర్యపోయి, ఒకవేళ తాను మొదట చూసినది మరొక మనిషేమో నని తన మనస్సు సరిపెట్టుకున్నాడు.




వాకిట నిలబడి ఉన్న అన్నగారిని చూసి గంగమ్మ తెచ్చి పెట్టుకున్న ఏడుపుతో, "ఇంత కాలానికి నేను జ్ఞాపకం వచ్చానా, అన్నయ్యా? సుఖపడతానని నాకీ సంబంధం చేశావు గాని, అన్నయ్యా, తిండి కూడా గతి లేక బాధపడుతున్నా నన్నయ్యా!" అంటూ నీళ్ళ పిడత అందించింది.

అనంతయ్య తన చెల్లెలి పరిస్థితికి చాలా బాధ పడ్డాడు. అతని ఆశలన్నీ నీరు కారి పోయాయి. అతను ఇంట్లోకి వస్తే తన గుట్టు



బయట పడుతుందని, గంగమ్మ బయటి అరుగు మీద ఒక కుక్కిమంచం వేసింది. దాని మీద తన దుప్పటి పరుచుకుని, అనంతయ్య నడుం వాల్చాడు.

పొలం నుంచి తన భర్త వచ్చే వేళ అయిందని గ్రహించి, గంగమ్మ దొడ్డి దారిన అతనికి ఎదురు వెళ్ళింది; అన్నగారు వచ్చినట్టు అతనికి చెప్పింది. రాక రాక, పెళ్ళి అయిన ఇంత కాలానికి బావమరిది తన ఇంటికి వచ్చాడని తెలిసి అతను చాలా సంతోషించాడు.

తన ఉద్దేశం భర్త గ్రహించక పొయ్యే సరికి గంగమ్మ, "అది కాదండీ, మనకు డబ్బు వుందని తెలిస్తే సహాయం చెయ్యమంటాడు. అందుకని కాస్త ఈ రోజుకు మనిద్దరం కటిక పేదవాళ్ళలా నాటకం ఆడాలి," అన్నది.

"పాపం, రాకరాక వస్తే అదేమిటి?" అన్నాడు భర్త.

"నా సొంత అన్నగారు! నాకు లేని ప్రేమ మీ కెందుకు?" అన్నది గంగమ్మ. అదీ నిజమే ననుకున్నాడు ఆమె భర్త.

గంగమ్మ ఒక పాత మంచం తెచ్చి తన భర్తకు కూడా బయట వేసింది. గతి లేక ఆమె భర్త దాని మీద పడుకున్నాడు. తన బావమరిదిని పలకరించటానికి మొహం చెల్లక, అతను అనంతయ్యను చూడనట్టు నటించాడు.

ఆ రోజు పండగ. గంగమ్మ పిండివంటలు చేసింది. పానకంలో పుడకలాగా అనంతయ్య రాకపోతే భార్యా భర్తలు ఎంతో ఆనందంతో వాటిని తినవలిసింది. గంగమ్మ భర్తకు కడుపులో ఎలుకలు గంతు లేస్తున్నాయి. ఒక రాత్రివేళ వచ్చి లేపి భోజనం పెడతానన్నది భార్య. అందు కోసం నిరీక్షిస్తున్నాడు భర్త.

అనంతయ్యకు నిద్ర పట్టలేదు. తన చెల్లెలి దారిద్ర్యం అతన్ని బాధిస్తున్నది.

గంగమ్మ భర్త తన బావమరిదిని చూసి జాలి పడ్డాడు. అయినా తన భార్యను బయట పెట్టగూడ దనుకున్నాడు. చలి జాస్తి అవుతున్నది. గంగమ్మ తన మంచం కింద ఉంచిన కుంపటిని ఆమె భర్త, అనంతయ్య మంచం కిందికి నెట్టి కొంత తృప్తిపడ్డాడు.

అర్ధ రాత్రి దాటింది. గంగమ్మ భర్త నిద్రలో మునిగిపోయాడు. అనంతయ్యకు మాత్రం నిద్ర పట్టలేదు. ఇంతలో గంగమ్మ నీడ లాగా కదులుతూ మంచాల దగ్గిరికి వచ్చింది, మంచాల కింద తడిమి, కుంపటి ఉన్న మంచం మీద ఉన్నది తన భర్తే అను కుని, "భోజనానికి రా," అని నెమ్మదిగా చెప్పి, లోపలికి వెళ్ళిపోయింది.

అనంతయ్యకు తన చెల్లెలి ప్రవర్తన అర్థం కాలేదు; తన భర్తకు భయపడి ఆమె తనకు రహస్యంగా భోజనం పెట్టుతున్న దనుకున్నాడు. అతను తన దుప్పటి కప్పుకుని నెమ్మదిగా లోపలికి వెళ్ళాడు.

పిండి వంటలతో సహా భోజనం వడ్డించి సిద్ధంగా వుంది. దీపం వెలుతురు మసక మసకగా ఉంది.

"భోజనం చెయ్యి. ఇంకేమన్నా కావాలంటే ఆ పక్కన కుండల్లో ఉన్నాయి, కావలిసినన్ని తీసుకో," అని గంగమ్మ



అవతలికి వెళ్ళిపోయింది. దుప్పటి కప్పుకుని వచ్చిన వాడు తన భర్తే అనుకున్న దామె. భర్త మంచం చీకట్లో తెలియగలందు లకు ఆమె కుంపటి ఉంచింది. ఆ సంగతి ఆమె తన భర్తకు చెప్పలేదు. ఆమె తిన్నగా వెళ్ళి గుమ్మం వద్ద కాపలా కూర్చున్నది.

తన చెల్లెలు ఎంతో ప్రేమతో పెట్టిన భోజనం గదా అని అనంతయ్య కడుపు నిండా తిని, చెయ్యి కడుక్కున్నాడు. కుండల్లో నుంచి తనకు కావలసినంత తీసుకో మన్నది గదా అని, తన దుప్పటి పరిచి, ఆమె చూపిన కుండలను అందులో బోర్లించాడు. అందులో బియ్యమూ, పిండివంటలూ, ఇంకేవేవో ఉన్నాయి. అన్నిటినీ మూట గట్టుకుని, అనంతయ్య తన చెల్లెలిని కేక వేస్తే బావగారు లేస్తాడని భయపడి, దొడ్డి దారిన బయటికి వచ్చి, ఇంటిదారి పట్టాడు.

మరి కాస్సేపటికి గంగమ్మ భర్త నిద్ర లేచి, తన భార్య భోజనానికి పిలవనందుకు మండిపడి, "ఒసే, భోజన మేదే?" అని కేక పెట్టాడు.

"భోజనం చేస్తివిగా? ఇంకా ఏమిటా కేకలు?" అన్నది గుమ్మంలో కూర్చున్న గంగమ్మ. భర్త మరింత మండిపడి గంగమ్మను నాలుగు తన్నాడు.

జరిగిన మోసం బయట పడింది.

"అసలు నువు కుంపటి ఎందుకు మార్చాలీ?" అన్నది గంగమ్మ.

"నా యిష్టం. సొంత అన్నకు తిండి పెట్టని దానివి, రేపు నా వాళ్ళు వస్తే కూడా ఇంతే చేస్తావు. పో బయటికి," అని భర్త గంగమ్మను బయటికి గెంటి తలు పేసుకున్నాడు.

అనంతయ్య తన చెల్లెలు యింటి నుంచి తెచ్చుకున్న బియ్యంలో రూపాయలుండటం చూసి, తన చెల్లెలి ప్రేమను తెగ మెచ్చుకుని, ఆ డబ్బుతో బండీ, ఎడ్లూ కొని సంతోషంగా ఉన్నాడు.









# నగలపెట్టె

ఒకనాటి రాత్రి బాగా చీకటిపడి ఒక కుటుంబం ప్రయాణం చేస్తూ పాపన్న ఇంటికి వచ్చింది. కుటుంబ పెద్ద జగ్గన్న అనే వాడు. అతని వెంట అతని భార్యా, ఒక అయిదేళ్ళ కుర్రవాడూ, ఇంకొక పాపా మాత్రమే ఉన్నారు. జగ్గన్న అత్తవారూరు పాపన్న ఉండే గ్రామానికి దక్షిణానా, అతని స్వగ్రామం ఉత్తరానా ఉన్నది. అతను సకుటుంబంగా అత్తవారూరు నుంచి, చీకటి పడ్డాక పాపన్న ఊరు చేరుకునే టట్టుగా కాలినడకన ప్రయాణమయ్యాడు.

జగ్గన్న బుద్ధిపూర్వకంగానే ఇలా చేశాడు. కారణ మేమంటే, అతను దొంగబుద్ధి కల వాడు. పేరుకు ఒక చిన్న దుకాణం పెట్టు కుని వ్యాపారం చేస్తున్నట్టు నటిస్తూ, అతను అవకాశం దొరికినప్పుడల్లా దొంగతనాలు చేస్తూండేవాడు. భర్త సంగతి భార్యకూ్కడా తెలుసును. కాని భర్త ఆగ్రహానికి వెరిచి, అతని రహస్యం తన కడుపులోనే దాచు కుని, కుక్కిన పేనులాగా ఉండిపోయింది.

జగ్గన్న పాపన్నను గురించి చాలా విని ఉన్నాడు. ఈ పాపన్న లోకజ్ఞానం ఎరగని అమాయకు డనీ, అతన్ని సులువుగా దోచ వచ్చుననీ అనుకుని, అవకాశం కోసం చాలా కాలంగా ఎదురు చూస్తున్నాడు. ఇప్పుడా అవకాశం దొరికింది.

అయితే జగ్గన్న కుటుంబం వచ్చేసరికి పాపన్న గ్రామంలో లేడు. రెండు రోజుల క్రితం గ్రామాంతరం వెళ్ళాడు. అయినా అభ్యాగతులకు ఏ లోటూ రాకుండా మీనాక్షీ, ఆమె అత్తగారూ కూడా వచ్చినవాళ్ళ సంగతి కనుక్కుని, ఆ రాత్రి భోజనాలు పెట్టి, పాపకు పాలు ఇచ్చి, వాళ్ళు పడుకో టానికి లోపలి గదిలో ఏర్పాటు చేశారు.

జగ్గన్న పడుకుని, అవతలి గదిలో మాట్లాడే మాటలన్నీ ఎంతో శ్రద్ధగా అల



కిస్తున్నాడు. పాపన్న తల్లి తన కోడలితో, "ఏమే, మీనాక్షి? మొన్న పెళ్ళికి వేసుకున్న నగలు ఇంకా ఇక్కడే ఉంచావేం? పెట్టెలో పెట్టకపోయావా?" అనటం జగ్గన్నకు వినిపించింది.

అత్తగారలా అన్న కాస్సేపటికి మీనాక్షి ఒక చేత దీపమూ, ఇంకో చేత నగలూ తీసుకుని మిద్దె మీదికి ఎక్కటం జగ్గన్న గమనించాడు. జగ్గన్న ఆమె వెనకగా మెట్ల మీదికి వెళ్ళి, మీనాక్షి నగలను ఏ పెట్టెలో పెట్టుతున్నదీ గమనించి, మళ్ళీ తన చోటికి వచ్చి పడుకున్నాడు. తరవాత కొంత సేపటికి మీనాక్షి కిందికి దిగి వచ్చి తాము పడుకునే గదికి వెళ్ళిపోయింది. అర్ధ రాత్రివేళ అందరూ గాఢనిద్రలో ఉన్న సమయంలో జగ్గన్న లేచి, పిల్లిలాగా మెట్లెక్కి పైకి వెళ్ళి, తాళం వెయ్యని పై గది ప్రవేశించి, పెట్టె సంగ్రహించి కిందికి దిగి వచ్చాడు. చుక్క పొడిచే వేళకు అతను నిద్ర లేచినట్టు లేచి, పెట్టెను బయటికి తీసుకుపోయి, చీకట్లో ఒక చోట గుర్తుగా పెట్టి, లోపలికి వచ్చి తన భార్యనూ, పిల్లవాణ్ణీ లేపి ప్రయాణమయాడు. ఈ అడావుడికి పాపన్న తల్లీ, మీనాక్షి కూడా లేచారు. జగ్గన్న వాళ్ళతో, "మాకు సెలవిప్పించండి. మేం బయలుదేరుతాం. వెళ్ళవలిసిన దూరం చాలా ఉంది," అన్నాడు.

జగ్గన్న కుటుంబం తిరిగి కాలినడకన ప్రయాణం సాగించింది. జగ్గన్న తాను దాచి ఉంచిన పెట్టె తీసుకుని వీపున వేసుకుని నడక సాగించాడు. మధ్యాన్నం వేళకు వాళ్ళు ఒక గ్రామం చేరుకుని, అక్కడ విశ్రాంతి తీసుకుని బయలుదేరారు. కుర్రవాడు నడవలేక ఎత్తుకోమని వేధించసాగాడు. జగ్గన్నభార్య కూడా పాపను ఎత్తుకుని నడవటం చేత ఆమెకు కాళ్ళు పీకసాగాయి. అందరూ దారి పక్కన చతికిలబడ్డారు. తాము వెళ్ళే దిక్కుగా ఏదైనా

బండి వెళుతూ కనిపిస్తే బాగుండు నను కున్నాడు జగ్గన్న.

ఇంతలో ఒక బండి కనిపించనే కని పించింది. అయితే అది వాళ్ళు వెళ్ళ వలిసిన దిక్కు నుంచి వస్తున్నది.

"ఆ బండి మన వూరువేపు వెళ్ళదురా!" అని జగ్గన్న అంటున్నా వినిపించుకోకుండా కుర్రవాడు వేలుపెట్టి చూపుతూ, "బండి! బండి!" అని కేకలు పెట్టసాగాడు.

ఆ బండి తోలుకుంటూ తన వూరు పోతున్న పాపన్న బండి ఆపి, "బండిలో ఎక్కుతావా, బాబూ?" అని కుర్రవాణ్ణి అడిగాడు.

తాము పోతున్నది ఫలానా గ్రామమని జగ్గన్న చెప్పాడు.

"ఫరవాలేదు, ఎక్కండి. ఇక్కడికి ఎంతో దూరంలేదు. మిమ్మల్ని దించి రేపు ఉదయం నేను మా వూరు పోతాను," అన్నాడు పాపన్న. అతను బండి దిగివచ్చి పెట్టె తీసుకుని బండిలో పెట్టుతూ, అది తన పెట్టెలాగే ఉండటం చూసి ఆశ్చర్య పోయాడు. కొంచెం శ్రద్ధగా చూస్తే "సోమయ్య" అన్న తన తండ్రి పేరు కూడా దాని పైన రాసి ఉన్నది. అతని ఆశ్చర్యం మరింత అయింది.



ఈ లోపల అందరూ బండి ఎక్కి కూర్చున్నారు. పాపన్న బండిని వెనక్కు తిప్పి జగ్గన్నగారి ఊరు కేసి తోలుతూ, "ఈ పెట్టెలాటిదే మా ఇంట్లోకూడా ఉంది. దాని పైన సోమయ్య అని రాసి ఉన్నదే, అది మా తండ్రిగారి పేరేకూడా," అన్నాడు.

జగ్గన్న గుండె గుభేలు మన్నది. అతను వెంటనే సంబాళించుకుని, "ఆశ్చర్యంగా ఉందే. మీ తండ్రిగారి పేరు కూడా ఇదేనా? అందుకే మనం దైవికంగా ఇలా కలుసు కున్నాం," అన్నాడు.

"మీ పేరు కూడా పాపన్నేనా ఏమిటి?" అని పాపన్న అడిగాడు.



జగ్గన్నా, అతని భార్యా కూడా ఉలిక్కి పడ్డారు. భయపడ వద్దని జగ్గన్న భార్యకు సంజ్ఞ చేసి, "బాగా కనిపెట్టారే? నా పేరు పాపయ్యే. మన పేర్లు కూడా ఒకటేనంటే ఇదేదో పూర్వ జన్మ సంబంధమే," అన్నాడు నవ్వుతూ.

త్వరలోనే చీకటి పడింది. బండి ఒక కుగ్రామం చేరింది. అక్కడ పడిపోయి, ఖాళీగా ఉన్న ఇళ్ళు ఒకటి రెండు ఉన్న సంగతి జగ్గన్నకు తెలుసు. అతను బండిని ఒక ఇంటి ముందు ఆపించి, "ఇదేనండి మా ఇల్లు! ఇక్కడ దిగుతాం," అన్నాడు. అతను పెట్టెను దించినాక అతని భార్యా, కుర్రాడూ కూడా దిగారు. దూరంగా తనకు తెలిసిన వాళ్ళ ఇల్లున్నదని, అక్కడ రాత్రి గడిపి, తెల్లవారి బయలుదేరి వెళతానని చెప్పి పాపన్న బండిని ముందుకు తోలుకు పోయాడు. తరవాత జగ్గన్న తన భార్యనూ, పిల్లవాణ్ణీ ఇంకొక కాళీ గుడిసెకు నడిపించుకుపోయి, ఆ రాత్రికి అందులో చేరాడు.

ముందు పెట్టె పగలగొట్టి, అందులో ఉన్న నగలు మూటగట్టి, పెట్టెను నామ రూపాలు లేకుండా చెయ్యాలని నిశ్చయించుకుని జగ్గన్న ఉలీ, సుత్తీ తేవటానికి బయలుదేరి వెళ్ళాడు. అతని భార్య ఎక్కడన్నా ఇన్ని పాలూ, రొట్టే తెద్దామని తాను కూడా బయలుదేరింది. గుడిసెలో కుర్రాడూ, పసి పాపా మిగిలారు.

కుర్రాడు పాపను ఆడిస్తూ పెట్టె దగ్గిర కూర్చున్నాడు. ఆ పెట్టెకు రెండు తాళా లున్నాయి. ఒకటి పెట్టె మూతలోనే అమర్చిన బీగం. రెండోది పెట్టె ముందు భాగంలో ఉండే కొక్కానికి తగిలించి వేసే తాళం. ఆ పెట్టెకు మీనాక్షి మొదటి బీగం సరిగానే వేసింది, కాని తాళాన్ని తొందరలో పూర్తిగా నొక్కలేదు. అది నొక్కితే పడే తాళం. పూర్తిగా నొక్కనందున అది సరిగా పడలేదు. కుర్రాడు ఆ తాళం కొంకి సందున ఒక



చేతి వేళ్ళుంచి, రెండో చేత్తో తాళాన్ని గట్టిగా నొక్కాడు. అప్పు డా తాళం టక్కు న పడింది. కుర్రాడి వేళ్ళు అందులో ఇరుక్కు పోయి, లాగితే రాలేదు. కుర్రాడు గట్టిగా అరిచి ఏడిచాడు.

వాడి కేకలు విని పక్క ఇంటి వాళ్ళు వచ్చి చూసి, "అరెరే, కుర్రాడు వేళ్ళను తాళంలో ఇరికించు కున్నాడే. తాళం తీయాలి. తాళపు చెవి ఎక్కడ?" అన్నారు.

కొంచెం సేపట్లో జగ్గన్న భార్య పాలూ, రొట్టెలూ తీసుకుని వచ్చి తన కొడుకు స్థితి చూసి, "బిడ్డను కాపాడండి, బాబూ! మీకు పుణ్యం ఉంటుంది," అని జనాన్ని బతి మాల సాగింది. జనం పోగుకా సాగారు. వాళ్ళతో బాటు పాపన్న కూడా వచ్చాడు.

అతను కుర్రవాణ్ణి చూసి, "అయ్యో, పాపం! తాళం తీయండి. లేకపోతే వాడి వేళ్ళు రావు. వాళ్ళ నాన్న ఎక్కడ?" అన్నాడు ఆదుర్దాగా.

అత నా మాట అంటూండగానే సుత్తీ, ఉలీ తీసుకుని జగ్గన్న వచ్చాడు; పాపన్నను చూసి కొయ్యబారి పోయాడు. పాపన్న అతని చేతిలో ఉన్న పనిముట్లు చూసి, "నిక్షేపం లాటి పెట్టెను పాడు చెయ్యకండి. తాళం తీస్తే తప్ప వాడి వేళ్ళు రావు. తాళం పగల




గొట్టటానికి ప్రయత్నిస్తే కుర్రాడి వేళ్ళకు ప్రమాదం. తాళంచెవి తీయండి," అన్నాడు.

"నిజం చెప్పెయ్యండి," అని జగ్గన్నతో భార్య రహస్యంగా అన్నది.

"నా దగ్గిర దాని తాళపుచెవి లేదు," అన్నాడు జగ్గన్న.

"నా దగ్గిర ఉన్న చెవి తాళానికి పడు తుందేమో చూస్తాను. నా పేరే మీ పేరు, నా తండ్రి పేరే మీ తండ్రి పేరు, మా పెట్టె లాటిదే మీ పెట్టె. నా తాళపు చెవి దాని కెందుకు పట్టకూడదూ?" అంటూ పాపన్న తన తాళపుచెవుల గుత్తిలో ఒకటి పైకి తీసి దానితో తాళం తెరిచాడు.



పాపన్న తాళపుచెవితో తాళం రావటమూ, పెట్టె తాళపు చెవి జగ్గన్న దగ్గిర లేకపోవటమూ, పాపన్న అన్న మాటలూ విన్న వాళ్ళలో కొందరు పాపన్నను, "అయ్యా, మీ పేరేమిటి ?" అన్నారు.

"ఈయనగారి పేరే నా పేరూనూ, పాపన్న," అన్నాడు పాపన్న.

"ఈయనగారి పేరు పాపన్న కాదండీ, జగ్గన్న. ఈ ప్రాంతాల బాగా ఖ్యాతిగలవాడు. పెట్టె లోపల ఉన్న బీగం కూడా మీ తాళపు చెవితో తెరుచుకుంటుందేమో కాస్త చూడండి," అన్నారు కొందరు.

పాపన్న పెట్టె బీగాన్ని కూడా తీసి మూత ఎత్తి, "అన్నిటికన్న అత్యద్భుతం! ఇందులో నగలన్నీ అచ్చు నా భార్య నగల లాగే ఉన్నాయి," అన్నాడు.

జగ్గన్న దొంగ అని అందరికీ సునాయాసంగా తెలిసిపోయింది. కొందరు అతన్ని పట్టుకు తన్నబోయారు. పాపన్న వారిని వారించి, "తొందర పడకండి. ఆయన దొంగతనం చేసినట్టు ఆయనకు తెలియకుండా మనకు తెలుస్తుందా ?" అన్నాడు.

జగ్గన్న భార్య ఏడుస్తూ పాపన్న కాళ్ళపైన పడి, "అయ్యా, అది మీ పెట్టే. ఒక రాత్రి మీ ఇంటి తిండి తిని మీ భార్య నగల పెట్టె ఎత్తు కొచ్చాం. మమ్మల్ని క్షమించండి," అన్నది.

"ఊరుకో, అమ్మా, ఊరుకో. ఇది నా పెట్టే అని మీ రన్నట్టయితే నేను తీసుకు పోతానులే. ఇప్పుడు నాకు జరిగిన నష్టం ఏమున్నది? ఏ పాపమూ ఎరగని పసి కుర్రవాడికి బాధ తప్పింది, అంతే చాలు," అన్నాడు పాపన్న.

పాపన్న తన గ్రామానికి తిరిగి వెళ్ళాడు. రాత్రి ఉన్న పెట్టె తెల్లవారి ఏమయిందా అని క్రితం రోజల్లా ఆదుర్దాపడిన మీనాక్షి, పాపన్న తల్లీ, పాపన్న వెంట పెట్టె ఉండటం చూసి ఎంతో ఆనందం పొందారు.





# ఉత్తర కాండ

అగస్త్యమహర్షి రాముడికి, సుకేశుడి కుమారు లైన మాల్యవంతుడూ, మాలీ, సుమాలీ లంకలో నివాసం ఏర్పాటు చేసుకుని, తమ భార్యల తోనూ, పిల్లల తోనూ నిర్విచారంగా ఉంటూ, వరాలు పొందిన గర్వంతో ముల్లోకాలనూ క్షోభ పెట్టారని తెలిపి, ఇంకా ఇలా అన్నాడు:

రాక్షసులు పెట్టే యాతనలు భరించలేక దేవతలూ, ఋషులూ మహేశ్వరుడి వద్దకు వెళ్ళి, "జగద్రక్షకా! సుకేశుడి కొడుకులు బ్రహ్మ నుంచి వరాలు పొంది పొగరెక్కి, స్వర్గం నుంచి దేవతలను తరిమేసి దాన్ని తాము ఆక్రమించుకున్నారు, మునుల ఆశ్రమాలూ, ఇళ్ళూ శూన్యం పెట్టేశారు. బ్రహ్మ, రుద్రుడూ, విష్ణువూ, ఇంద్రుడూ, యముడూ, వరుణుడూ, చంద్రుడూ, సూర్యుడూ అన్నీ తామే నని చెప్పుకుంటు న్నారు. ఏ క్షణం చూసినా యుద్ధ సన్నద్ధులై ఉండే ఆ రాక్షసుల నుంచి, మమ్మల్ని కాపాడు," అని భయపడుతూ వేడుకున్నారు.

అయితే మహేశ్వరుడు సుకేశుడి పట్ల పక్షపాతం కలవాడు. అందుచేత ఆయన వారితో, "దేవతలారా, మహర్షులారా! ఆ రాక్షసులను చంపటం నాకు సాధ్యం కాదు. వారి చావు నా చేతిలో లేదు. నా మాట విని మీరు విష్ణువు వద్దకు వెళ్ళారంటే, ఆయన తప్పకుండా వాళ్ళను చంపగలడు," అన్నాడు.

దేవతలు మొదలైన వారు మహేశ్వరుడికి జయం పలికి విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి,



మహేశ్వరుడితో మొర పెట్టుకున్నట్టే మొర పెట్టుకుని, త్రికూటపర్వతం మీది లంకా నగరంలో చేరిన రాక్షసులను చంపి, తమను కాపాడమనీ, తమకు వేరే దిక్కు లేదనీ వేడుకున్నారు.

విష్ణుమూర్తి వారికి అభయ మిచ్చి, "నేను సుకేశుణ్ణీ, అతని ముగ్గురు కొడుకులనూ ఎరుగుదును. వారి ప్రవర్తన చూస్తే నాకూ మంటగానే ఉన్నది. నేను వాళ్ళను సంహరిస్తాను. మీరు భయపడకండి," అన్నాడు. ఈ మాటలు విని దేవతలు పరమానంద భరితులై, విష్ణుమూర్తిని ప్రశంసించి తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

ఈ సంగతి లంకలో తెలిసింది. మాల్యవంతుడు తన తమ్ములతో, "దేవతలూ, ఋషులూ చేరి మనను చంపించటానికి చూస్తున్నారు. వాళ్ళు మహేశ్వరుడి వద్దకు వెళ్ళి మనను చంపమని కాళ్ళా, వేళ్ళా పడ్డారట. ఆ పని తనకు సాధ్యం కాదనీ, విష్ణుమూర్తి వద్దకు వెళ్ళమనీ, మహేశ్వరుడు సలహా ఇచ్చాడట. ఆ సలహా ప్రకారం వాళ్ళు విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి, ఆయన కాళ్ళ పైన పడ్డారట. ఆయన మన నందరినీ చంపుతానని వారికి అభయ మిచ్చి పంపేశాడట. విష్ణుమూర్తి మనని చంపటానికి నిశ్చయించి నట్టయితే మన మేం చెయ్యాలో ఆలోచించటం మంచిది. ఎందుకంటే, ఆయన హిరణ్యకశిపుడి లాటి అనేక మంది ప్రబల రాక్షసులను చంపి ఉన్నాడు. ఎన్నో వరాలు పొంది, యజ్ఞాలు చేసి, దివ్యాస్త్రాలు సంపాదించి, మాయలలో ఆరితేరిన రాక్షసు లాయనతో యుద్ధం చేసి చచ్చారు. ఈ సంగతి మనసులో ఉంచుకుని మన కర్తవ్యం నిర్ణయించుకోవాలి," అన్నాడు.

దీనికి మాలీ సుమాలీ ఇలా చెప్పారు:

"మనం పండితులం; యజ్ఞాలూ, దానాలూ చేసిన వాళ్ళం; మనకు అంతులేని ఐశ్వర్యం ఉన్నది; అత్యంత బలవంతు



లైన శత్రువులను జయించాం; విష్ణుమూర్తి అయేది, రుద్రు డయేది, ఇంద్రు డయేది మన ఎదట నిలబడలేడు. మనకే లోకాలన్నీ వణికిపోతాయి. విష్ణుమూర్తి మనని ద్వేషించ టానికి కారణ మేమీ కనబడదు. ఈ దేవ తలే ఆయనను రేపెట్టి ఉంటారు. అందుకు మనం సైన్యాలతో సహా బయలుదేరి వెళ్ళి ఆ దేవతల పని పట్టిద్దాం."

ఈ విధంగా ఆలోచించుకుని ఆ రాక్షస సహోదరులు యుద్ధ యత్నాలు చేసి, సైన్య సమేతులై స్వర్గం మీదికి బయలుదేరారు. లంక నుంచి వారి వెంట రథాలూ, ఏను గులతో, గుర్రాలతో, ఒంటెలు మొదలైన వాటితో నడిచే వాహనాలూ, స్వర్గాన్ని ముట్ట డించటానికి కదిలాయి. అపారమైన ఆ రాక్షససేనకు నాయకుడు మాలి. ఇలా రాక్షసులు లంకను విడిచి బయలుదేరగానే లంక పాడుపడి నట్టయిపోయింది.

రాక్షసులు యుద్ధానికి కదిలిన మాట తెలియగానే విష్ణుమూర్తి, ధగధగా మెరిసే కవచం ధరించి, బాణాలూ, విల్లూ, శంఖమూ, చక్రమూ, గదా, ఖడ్గమూ తీసు కుని, పీతాంబరంతో గరుడవాహన మెక్కి వచ్చి దేవసేనను చేరగానే ఉభయపక్షా లకూ యుద్ధం ప్రారంభమయింది.



విష్ణుమూర్తి తన బాణాలతోనూ, చక్రం తోనూ అనేక మంది రాక్షసులను చంపాడు. కాని మాలి విష్ణుమూర్తి నెదుర్కొని, అతి దారుణమైన యుద్ధం చేసి, విష్ణుమూర్తి వాహనమైన గరుత్మంతుడు తల మీద బలంగా కొట్టి, యుద్ధరంగం నుండి పారి పోయేటట్టు కూడా చేశాడు. అయితే చివ రకు విష్ణుమూర్తి తన చక్రాయుధంతో మాలి తల తెగనరికాడు. మాలి చావటం చూసి సుమాలీ, మాల్యవంతుడూ, తమ రాక్షస బలాలతో సహా లంకలోకి పారిపో యారు. విష్ణుమూర్తి ఆ రాక్షసులను వెన్నాడి వధించ సాగాడు.




అది చూసి మాల్యవంతుడు, "నీవు క్షత్రియ ధర్మం కూడా పాటించకుండా పారిపోతున్న మమ్మల్ని వెంటాడి చంపుతున్నావే! అటువంటి వాడికి వీరస్వర్గం కూడా రాదుగద. నీ కంతగా యుద్ధం చెయ్యాలని ఉంటే నాతో చెయ్యి," అంటూ, విష్ణువుకు ఎదురుగా నిలబడ్డాడు.

"మీరు యుద్ధరంగం నుంచి పారిపోవటమే గాదు, పాతాళ లోకంలో దాక్కున్నా వెతికి చంపుతాను. మిమ్మల్ని చంపుతానని దేవతలకు మాట ఇచ్చాను. ఆ మాట తప్పను," అన్నాడు విష్ణుమూర్తి. ఇద్దరూ యుద్ధానికి తలపడ్డారు. మాల్యవంతుడు



విష్ణుమూర్తినీ, గరుత్మంతుణ్ణీ కూడా చాలా పీడించాడు. అయితే గరుత్మంతుడు తన రెక్కలు విసిరి గాలి పుట్టించే సరికి, ఆ గాలి మాల్యవంతుణ్ణి ఆకాశం లోకి ఎగరగొట్టింది. అది చూసి సుమాలి తన సైన్యంతో సహా లంకలోకి పారిపోయాడు. మాల్యవంతుడు ఎలాగో తన సేనను కలుసుకుని, పుట్టెడు పరాభవంతో లంకకు చేరుకున్నాడు.

అటు తరవాత విష్ణుమూర్తి లంకావాసులైన రాక్షసులతో అనేక యుద్ధాలు చేసి, అనేక మంది రాక్షస వీరులను చంపిన అనంతరం, చావగా మిగిలిన రాక్షసులు తమ భార్యలతోనూ, పిల్లలతోనూ, పరివారంతోనూ లంకను విడిచిపెట్టి పాతాళలోకానికి వెళ్ళి, అక్కడ నివాసం ఏర్పరుచుకుని, సుమాలిని తమ అధిపతిగా చేసుకున్నారు. ఆ కాలంలో విష్ణుమూర్తి చేత చచ్చిన మాల్యవంతుడు మొదలైన రాక్షసులు రావణ కుంభకర్ణుల కంటె బలవంతులు.

రాక్షసులు లంకను విడిచి వెళ్ళిపోగానే వైశ్రవణుడు (కుబేరుడు) తిరిగి లంకలో నివసించ నారంభించాడు.

కొంత కాలం గడిచింది. సుమాలి ఒకనాడు కైకసి అనే తన కుమార్తెను వెంట బెట్టుకుని పాతాళలోకం నుంచి బయలు







వేరి భూలోకంలో విహరించ వచ్చాడు. వారు భూమి మీద తిరుగుతూ ఉండగా, పుష్పకం ఎక్కి తన తండ్రిని చూడటానికి వెళుతున్న కుబేరుడు వారికి కనిపించాడు.

కుబేరుడి ఐశ్వర్యంతో తన దౌర్భాగ్య స్థితిని పోల్చుకుని సుమాలి, "ఏం చేస్తే మేం వృద్ధిలోకి వస్తాం?" అని ఆలోచించుకుని, చివరకు ఒక ఆలోచన చేశాడు. అపర లక్ష్మిదేవి లాటి తన కుమార్తెతో అతను, "అమ్మా, నీకు పెళ్ళియీడు వచ్చింది. నిన్ను పెళ్ళాడగోరే వారు చాలా మంది ఉన్నారు, కాని నీవు ఒప్పుకోవని సంశయిస్తున్నారు. విశ్రవసుడి కొడుకైన కుబేరుడి మహావైభవం కళ్ళారా చూశావుగద. విశ్రవసుడు పులస్త్యబ్రహ్మ కొడుకు, మహాముని. ఆయనను సేవించావంటే నీ కూ్కడా ఇలాటి కొడుకులే కలుగుతారు," అన్నాడు.

కైకసి తండ్రి మీది గౌవరం కొద్దీ బయలుదేరి, విశ్రవుడు తపస్సు చేసుకునే చోటికి వెళ్ళి నిలబడింది. ఆ సమయానికి విశ్రవుడు అగ్నిని అర్చిస్తున్నాడు. నిండు చంద్రుడి లాగా వెలిగిపోతున్న కైకసిని చూసి విశ్రవుడు, "సుందరీ, ఎవరి కుమార్తెవు? ఎక్కడి నుంచి వచ్చావు? ఏం పని మీద వచ్చావు? నిజం చెప్పు," అన్నాడు.

కైకసి చేతులు జోడించి, "మునీశ్వరా, మీరు తపశ్శక్తితో అంతా తెలుసుకోగలరు. నేను నా తండ్రి ఆజ్ఞ ప్రకారం వచ్చాను. నా పేరు కైకసి," అన్నది.

"అవును. తెలిసింది. నా వల్ల కొడుకులను కోరి వచ్చావు," అని విశ్రవుడామెను యథావిధిగా పెళ్ళాడి, "నీవు సంతానం కోరి వచ్చినది రాక్షస ఘడియలలో. ఆ కారణంగా నీకు దారుణమైన మహా క్రూరులైన రాక్షసులు కలుగుతారు," అన్నాడు.

"మీ వంటి తపశ్శాలికి అలాటి పిల్లలు పుట్టటమా? నాకు అవసరం లేదు. మంచి పిల్లలను దయచేసి అనుగ్రహించండి,"



అన్నది కైకసి. ఆమె ఎంతో బతిమాలిన మీదట విశ్రవుడు, "సరే, నీ చిన్న కొడుకు నీ వంశానికి తగి ఉంటాడులే," అన్నాడు.

కొంతకాలం గడిచాక కైకసి ఒక పిల్ల వాణ్ణి కన్నది. వాడు చూడటానికి పరమ వికారంగా ఉన్నాడు—రాక్షసి రూపం, భయంకరాకారం, పది తలలు, పెద్ద కోరలు, కాటుక రంగు శరీరచ్ఛాయ, ఎర్రని పెదవులు, ఇరవై చేతులు, పెద్ద పెద్ద నోళ్ళు! అతనికి పది తల లుండటం చూసి, విశ్రవుడా కుర్రవాడికి దశగ్రీవుడు (పది కంఠాలు గలవాడు) అని నామకరణం చేశాడు. అతనే రావణుడు.

రావణుడి తరవాత పుట్టిన కుంభకర్ణుడు, మహాబలుడు, ఏ జంతువుకూ లేనంత పెద్ద శరీరం గలవాడు. అతని అనంతరం వికృతమైన ముఖం గల శూర్పణఖ పుట్టింది. అందరి కన్న ఆఖరుకు పుట్టిన వాడు విభీషణుడు. అతను సత్యగుణం గలవాడు.

రావణ కుంభకర్ణులు అరణ్యం లోనే పెరుగుతూ, తమ అసాధారణ బలంతో అందరికీ దిగులు పుట్టిస్తూ సంచరించసాగారు. కుంభకర్ణుడు ఋషులను పట్టుకుని తినేస్తూ ఉండేవాడు. విభీషణుడు మాత్రం స్వాధ్యాయం చేస్తూ, నియమితాహారుడై, ధర్మమార్గం అవలంబించాడు.

వారందరూ ఆశ్రమం లోనే ఉండగా ఒకనాడు కుబేరుడు పుష్పకం పైన తన తండ్రిని చూడ వచ్చాడు. కుబేరుడి తేజస్సూ, ఐశ్వర్యమూ చూసి అసూయపడిన కైకసి తన పెద్ద కొడుకైన రావణుడితో, "మీ అన్న అయిన కుబేరుడి వైభవం చూశావా? ఆ తండ్రికి పుట్టినవాడివే గదా, నీవు చూడు ఏలా గున్నావో! నీవు ఆ కుబేరుడితో సమానంగా ఉంటే నేను సంతోషిస్తాను రా నాయనా," అన్నది.

అమిత ప్రతాపశాలి అయిన రావణుడికీ మాటలు రోషం తెప్పించాయి. అతను





తన తల్లితో, "అమ్మా, నేను నా సవతి అన్నతో సమానుణ్ణో, అంతకు మించినవాణ్ణో అయి తీరుతాను. విచారించకు," అని ప్రతిజ్ఞ చేశాడు. అతను కుంభకర్ణుడితో కలిసి మహత్తరమైన పనులు చేయాలని సంకల్పించుకుని, తన తమ్ములతో సహా గోకర్ణాశ్రమానికి వెళ్ళి, అక్కడ అతి తీవ్రమైన తపస్సు చేశాడు. అతనితో కుంభకర్ణ విభీషణులు కూడా తపస్సు చేశారు.

రావణుడు నిరాహారుడై పదివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. అతను వెయ్యి సంవత్సరాల కొక శిరస్సు చొప్పున నరికి అగ్ని గుండంలో వేశాడు. అతని పది తలలలో తొమ్మిది ఆహుతి అయి, ఒక్కటి మిగిలింది. పదివేల సంవత్సరాలూ ముగిసి, రావణుడు తనకు మిగిలిన ఒక్క తలనూ నరుక్కో బోతుండగా, బ్రహ్మ దిక్పాలకులను వెంట బెట్టుకుని వచ్చి, "దశగ్రీవా, నీ తపస్సుకు మెచ్చాను. నీ కిష్టమైన వరం కోరుకో," అన్నాడు.

రావణుడు పరమానందంతో బ్రహ్మకు సాష్టాంగ నమస్కారం చేసి, "తాతా, ప్రాణులకు మరణ భయాన్ని మించిన భయం మరొకటి లేదు. నాకు చావు లేకుండా వరమియ్య," అన్నాడు.

"నాయనా, అలాటి వర మియ్యటం సాధ్యం కాదు, మరొక వరం-కోరుకో," అన్నాడు బ్రహ్మ.

"ఇతర ప్రాణుల భయం నా కేమీ లేదు గాని, నాకు సుపర్ణులూ, నాగులూ, యక్షులూ, దైత్యులూ, దానవులూ, రాక్షసులూ, దేవతలూ మొదలైన వారి వల్ల చావు లేకుండా వరమియ్య. మనుష్యులు మొదలైన వాళ్ళు నాకు తృణప్రాయులే," అన్నాడు రావణుడు.

రావణుడు కోరినట్టే బ్రహ్మ వర మిచ్చాడు; ఆ వరంతో బాటు రావణుడికి పది తలలూ ఎప్పటి లాగే ఉండేటట్టూ,

అతనికి కోరిన రూపం సిద్ధించేటట్టూ కూడా వరమిచ్చాడు.

తరవాత బ్రహ్మ విభీషణుణ్ణి కూడా వరం కోరుకో మన్నాడు. తన మనసు ధర్మం తప్పకుండానూ, తలచినప్పుడు తనకు బ్రహ్మాస్త్రం స్ఫురించేటట్టూ విభీషణుడు వరం కోరాడు. బ్రహ్మ అతనికి కోరిన వరమిస్తూ, చావు లేకుండా కూడా వరమిచ్చాడు.

తరవాత వరం పుచ్చుకునే వంతు కుంభకర్ణుడిది. దేవతలు బ్రహ్మతో, "దేవా, కుంభకర్ణుడికి వర మియ్యవద్దు. నందన వనంలో విహరిస్తున్న అప్సర స్త్రీలను ఏడుగురిని తినేశాడు, దేవేంద్రుడి అనుచరులను పది మందిని తినేశాడు, ఎంత మంది ఋషులనూ, మునులనూ తిన్నాడో లెక్కే లేదు. వరాలు పొందకుండానే వీ డిలా ఉంటే, వరాలు పొంది ఎలా తయారవుతాడో!" అన్నారు.

ఈ మాటలు విని బ్రహ్మ సరస్వతిని స్మరించి రప్పించి, కుంభకర్ణుడి వాక్ స్థానాన్ని వశపరుచుకో మని చెప్పాడు. తరవాత ఆయన కుంభకర్ణుణ్ణి చూసి, "నీ కిష్టమైన వరం కోరు," అన్నాడు.

సరస్వతీ ప్రభావం చేత కుంభకర్ణుడు, "నాకు సంవత్సరాల తరబడి నిద్రపోయేటట్టు వరమియ్యి," అన్నాడు. తథాస్తు అని చెప్పి బ్రహ్మ అదృశ్యుడయాడు. కుంభకర్ణుడి వాక్కు నుంచి సరస్వతి కూడా దిగిపోయింది.

వెంటనే కుంభకర్ణుడికి స్పృహ వచ్చినట్టయింది. "ఛీ, ఛీ! ఏమిటిలాటి వరం కోరాను? దేవత లేదో మాయపన్ని నన్ను మోసగించారు," అని చింతించాడు.

రావణ కుంభకర్ణ విభీషణులు ఈ విధంగా బ్రహ్మ వల్ల వరాలు పొంది, శ్లేష్మాతక వనానికి వెళ్ళి, అక్కడ నివసించసాగారు.





# శుంభనిశుంభులు

## 2

అన్నను పోషించే భారం నిశుంభుడి మీద పడింది. ఇద్దరివీ పెద్ద పొట్టలు. నిశుంభుడు ఎంత కష్టపడి ఆహారం తెచ్చినా కుడిచి కూర్చుని శుంభుడు, "ఇంకాతే!" అంటున్నాడు. చివరకు ప్రాణం విసిగి పోయి నిశుంభుడు, "ఇక నుంచీ నేను నీకు తిండి పెట్టేది లేదు. నీ ఆహారం నువే సంపాదించుకో," అన్నాడు.

"కాదు, నాకు నువు తిండి పెట్టితీరాలి," అన్నాడు శుంభుడు.

"ఇలా నా పైన పడి బతికే కన్న నీ తలలో ఉండే కొమ్మ పీకేసుకుని చచ్చి పోరాదూ?" అంటూ నిశుంభుడు అన్న తలలో చెయ్యి పెట్టాడు.

వా ళ్ళిద్దరికీ తలలో వెంట్రుకల కింద కొమ్ము లున్నాయి, వాటి లోనే ఉన్నాయి వాళ్ళ ప్రాణాలు.

శుంభుడికి ప్రమాదం ఏర్పడింది. తనది ఒకటే చెయ్యి. కలియబడితే నిశుంభుడు తనను సులువుగా చంపేస్తాడు. "ఒరే, నిశుంభా, నాకు తిండి పెట్టవలిసి వస్తుందని నా ప్రాణం తీయదలిచావు కాదూ? నాకు పెట్టకుండా నువ్వెలా తింటావో చూస్తాను. నువు చస్తేనే గాని నేను చావను, చూసుకో!" అంటూ శుంభుడు తన శరీరం చిన్నది చేసుకుని, నిశుంభుడి నోటి ద్వారా జొర బడి, వాడి పొట్టలో చేరి కూర్చున్నాడు.

నిశుంభుడు నిస్సహాయుడై పోయాడు. వాడు తినేదంతా శుంభుడే అరగిస్తున్నాడు. అసలే తిండి అందక నీరసించడంతో పాటు పొట్ట పెద్దదైపోయి బరువెక్కడం మరింత నీరసానికి దారి తీసింది. ఎంత తిన్నా వాడి సొంత ఆకలి కొంచెం కూడా తీరటం లేదు. పోనీ ఏమీ తిన కుండా ఉండి, పొట్టలో

అట్ట చివరి బొమ్మ



ఉన్న అన్నను కూడా మాడ్చుదా మంటే, వాడు లోపలి నుంచి తన్ని పొట్ట అంతా హూనం హూనం చేస్తాడు.

శుంభుణ్ణి ఎలాగైనా చంపితేనే తప్ప తనకు విముక్తి లేదనిపించింది నిశుంభుడికి. కాని అందుకు మార్గం ఏమీ తోచలేదు. తాను తిండి తిన కుండా మొండికేస్తే శుంభుడు బయటికి వస్తాడేమో అనుకున్నాడు. బయటికి వస్తే తాను వాణ్ణి చంపెయ్యవచ్చు, లేదా వాడి చేతిలో తాను చచ్చినా చావవచ్చు. అన్నిటికీ సిద్ధపడి నిశుంభుడు మొండికేసి పస్తు పడుకున్నాడు. లోపలి నుంచి శుంభుడు చచ్చేటట్టు తన్నుతున్నాడు. ఆ బాధకు నిశుంభుడు గట్టిగా శ్వాస తీసి విడుస్తున్నాడు.

ఒకసారి నిశుంభుడు గట్టిగా శ్వాస లాగే సరికి ఆ గాలితో ఒక గడ్డిపోచ లాటి మనిషి నిశుంభుడి దగ్గరికి కొట్టుకు వచ్చాడు.

నిశుంభు డా మనిషిని చూసి, "ఎవరు నువు? ఎందు కొచ్చావు?" అని అడిగాడు.

"నేను వచ్చానా? నువే నన్ను నీ శ్వాసతో లాగావు. ఇంకేం నన్ను తినెయ్యి. అందుకే గదా నన్ను దగ్గిరికి ఈడ్చుకున్నావు?" అన్నాడా గడ్డిపోచ లాటి మనిషి.

"నిన్ను తింటే నా ఆకలి తీరుతుందా? అయినా నీకు చావాలని ఉన్నట్టుంది దేనికి?" అన్నాడు నిశుంభుడు.

"నా పేరు తృణాంగుడు. నా కథ వింటే నే నెందుకు చావ సిద్ధంగా ఉన్నానో నీకే తెలుస్తుంది," అన్నా డా మనిషి. అతను తన కథను ఇలా చెప్పాడు.

తృణాంగుడు పుట్టినది మొదలు చీపురు పుల్ల లాగే పెరిగాడు. బొత్తిగా బలం లేదు. గాలికి కొట్టుకుపోయేవాడు. ఏ చేత్తో ఒక పువ్వు పట్టుకున్నా ఆ పక్కకు ఒరిగి పడిపోయేవాడు. కొంత కాలానికి తృణాంగుడికి పెళ్ళాడా లనిపించింది. తాను పెళ్ళాడ దలిచిన పిల్ల తండ్రిని అడిగాడు. ఆయన

తృణాంగుడికి ఒక పూలమాల చూపి, "దీన్ని ఒక్క చేత్తో ఎత్తి పట్టుకుంటే మా అమ్మాయి నిస్తాను," అన్నాడు. తృణాంగుడు మాలను ఎత్తలేక ఎగతాళి పాలయాడు. ఇలా జీవించే కన్న అడవిలో రాక్షసుల వాతపడి చావటమే మేలనిపించి ఇలా వచ్చాడు.

ఇదంతా చెప్పి తృణాంగుడు నిశుంభుడితో, "నీ శ్వాస కుండే బలంలో ఒక్కవంతు నా కుండినట్టయితే నేను పెళ్ళాడి, సుఖంగా ఉండేవాణ్ణి," అన్నాడు.

నిశుంభుడు కొంచెం ఆలోచించి తృణాంగుడితో, "నా కొక్క సహాయం చేసిపెట్టి నట్టయితే నీకు నా బలమంతా ఇస్తాను. నా పొట్టలో నా అన్న ఉన్నాడు. వాడు నన్ను పెట్టరాని హింస పెట్టుతున్నాడు. వాడిప్పుడో ఇంకాస్సేపటికో బయటికి వస్తాడు. వాణ్ణి నువు చంపెయ్యాలి. అదేమంత కష్టం కాదు. ఎందుకంటే వాడికొక చెయ్యే లేదు. అదీగాక వాడి ప్రాణం వాడి తలలో ఉండే కొమ్ములో ఉంది; దాన్ని పీకితే వాడు చస్తాడు. వాణ్ణి చంపటానికని నా బలం అంతా నీ కిచ్చి నేను నిస్సత్తువగా పడి ఉంటాను. అందుచేత వాడు బయటికి వస్తూనే, నా తలలో ఉండే కొమ్ముపీకి నన్ను చంపాలని చూడవచ్చు. వాడాపని చెయ్యకుండా నువు అడ్డుపడి వాణ్ణి



చంపాలి. వాడు చచ్చాక నా బలం నాకు తిరిగి ఇచ్చెయ్యి. ధైర్యంగా ఈ పని చెయ్య గలవా?" అన్నాడు.

"చావుకు సిద్ధపడ్డ వాడికి భయమేమిటి? నీ బలం నా కిచ్చెయ్యి," అన్నాడు తృణాంగుడు. నిశుంభుడు తృణాంగుడి వంటి మీద నిమిరాడు. తనకు ఎంతో బలం వచ్చినట్టు తృణాంగుడు గ్రహించాడు. నిశుంభుడు నీరసంగా పడిపోయాడు.

కొద్ది సేపట్లో శుంభుడు ఆకలికి తాళలేక తన తమ్ముడి శరీరంలో నుంచి పైకి వచ్చేశాడు. వాడు పడిపోయి ఉన్న నిశుంభుడితో, "ఏమిత్రా, ఈ దొంగ వేషాలూ? లేచి వెళ్ళి ఆహారం తెస్తావా, తేవా?" అన్నాడు.

నిశుంభుడు మూలిగాడు.

ఇంతలోనే తృణాంగుడు శుంభుడి పైన పిడుగు లాగా పడి, ఒక్క తన్నుతో శుంభుణ్ణి పడగొట్టి, వాడి తలలోని కొమ్ము పీకి, చంపేశాడు. శుంభుడు ప్రాణాలు వదులుతూ తృణాంగుడితో, "వాణ్ణి కూడా ఇలాగే చంపు. లేకపోతే వాడు నిన్ను మింగేస్తాడు," అని హెచ్చరించాడు.

తృణాంగుడికి కూడా అదే సరయిన పనిగా తోచింది. ఈ రాక్షస సోదరుల దుశ్చర్యలను గురించీ, వీళ్ళు నృగమహారాజు సేన లన్నిటినీ హతమార్చటం గురించీ అతను విని ఉన్నాడు. అటువంటి వాళ్ళను బతకనివ్వటం ప్రమాదమూ, అక్రమమూనూ. ఇలా అనుకుని తృణాంగుడు నిశుంభుడి తలలో కొమ్ము కూడా పీకేసి, వాణ్ణి కూడా చంపేశాడు. అంత మహా బలశాలులు కూడా, కాలం తీరే సరికి, మును లన్నట్టు, గడ్డిపోచ లాటి వాడి చేతనే చచ్చారు. తృణాంగు డిప్పుడు బలసంపన్నుడై తన ఇంటికి తిరిగి పోయి, రాక్షసులను చంపినందుకు రాజసన్మానం పొంది, తాను కోరిన కన్యనే వివాహ మాడి గొప్ప కీర్తి గడించాడు.



# 46. సేంట్ సోఫియా చర్చి

ఇస్తాన్‌బుల్ లో 14 శతాబ్దాల క్రితం నిర్మించబడిన ఈ బైజాంటైన్ చర్చిలో బైజాంటైన్ చక్రవర్తులు వైభవంగా రాజ్యాభిషేకాలు చేసుకున్నారు. కాన్‌స్టాంటినోపుల్ ముస్లిము లాక్రమించుకున్నాక ఇది మసీదుగా మారింది. 1934 లో కెమాల్‌పాషా దీన్ని బైజాంటైన్ కళల మ్యూజియంగా మార్చాడు.



 Photo by A. L. Syed



బహుమతి పొందిన వ్యాఖ్య

అన్నెం పున్నెం ఎరగని వాళ్ళం

పంపినవారు: కె. వి. రాజు, రాజమండ్రి

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

అన్నం నీళ్ళూ అడగని వాళ్ళం

పంపినవారు:
కె. వి. రాజు, రాజమండ్రి

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1965 నవంబర్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ సెప్టెంబర్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అన్నెం పున్నెం ఎరగని వాళ్ళం

రెండవ ఫోటో : అన్నం నీళ్ళూ అడగని వాళ్ళం

పంపినవారు : కె. వి. రాజు,

ప్రకాశంనగర్, రాజమండ్రి—3

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at The B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

మధు పిక్చర్స్

# జ్వాలాద్వీప రహస్యం



## ఇంటి సదుపాయాలతో బస - రుచికరమైన భోజనము



# న్యూ మాడరన్ హెూటెల్

శాకాహారము - లాడ్జింగు - రెస్టారెంటు

డయాగనల్ రోడ్డు, విశ్వేశ్వరపురం, బెంగళూరు - 4

(మినర్వా సర్కిల్ దగ్గర)

సుందరముగా ఫర్నిషింగు చేసిన గదులు, రోజు 24 గంటలూ చన్నీళ్ళూ, వేడినీళ్ళూ సప్లయి. విందులకూ టీ–పార్టీలకూ ప్రత్యేకించిన గదులు.

ఫోన్: 72849 & 27660

---

## జలుబు?

# పెప్స్

## తీసుకోండి!

పెప్స్ బిళ్లలను మెల్ల మెల్లగా చప్పరించండి. అందలి శమనకరమైన, ఆరోగ్యవంతమైన ఆవిరులను ఆస్వాదించిన వెంటనే మీకు నివారణ కలుగును... దీని వలన గొంతుక నొప్పి మరియు రొమ్ము నందలి వాపులకు నివారణకలుగును... దగ్గు మరియు జలుబును కలుగజేసే క్రిములను నిర్మూలించుటకు ఇది సహాయపడును. మీరు త్వరితంగానే నివారణను పొందగలరు

- ★ జలుబు మరియు గొంతుక నొప్పికి లాభదాయకమైనది.
- ★ పిల్లలకు సురక్షితమైనది.
- ★ అన్ని జనరల్ స్టోర్స్ మరియు కెమిస్టుల వద్ద దొరుకును.

# పెప్స్

శీఘ్రముగా నివారణ నొసగును.







ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్లు: Ms. వినోద్ & కో, పోస్టు బాక్సు 148, హైదరాబాదు - 12

# అమృతాంజనం

## వాడి శీఘ్రంగా నివారణ పొందండి

స్థాయికంగా ఉండే బాధను నివారణ చేసుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా బెణుకులకు కండరాల నొప్పులకు తలనొప్పికి ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకు సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెం కొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది. కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతా కలిసి నెలలు తరబడి వస్తుంది. అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధిని పొందిన నమ్మకమైన గృహ ఔషధం.

**అమృతాంజన్ నొప్పుల జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు**




**బెణుకునొప్పి**
ఎంత ఎక్కువగా ఉన్నా
**బెణికినచోటేకదా!**

అమృతాంజన్ లిమిటెడ్,
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

JWT/AM/2819

